

- (రధం - దేవాలయం)

శ్రీ ఆదికేశవ ఎంబుర్‌మానార్ స్వామిదేవాలయం, నర్సాపురంలో షు.200 సం॥క్రితం (1786లో) నిర్మితమై ప్రసిద్ధిచెంది, భక్తులు సేవించుకొనుచుండగా, 1996 డిశంబర్, 24న గుర్తుతెలియని దుండగలు స్వామివారి రధానికి నిప్పుపెట్టి దగ్ధము చేసినారు.

భక్తులైన యువకులు, పెద్దలు అభిమానులు స్పందించి కలవర పడి ఇందువల్ల దుష్ఫలితాలు రాగలవని భీతి చెందగా, డిపార్ట్‌మెంటువారు వచ్చి పరిశీలించి నూతన రథ నిర్మాణానికి మూడులక్షల రూపాయల ఖర్చు అగునని అంచనా వేశారు. ఇంకానిర్మాణం కాలేదు.

ఇలాంటి దుశ్చర్యలు భవిష్యత్‌లో జరుగకుండా భక్తులైన యువకులు, పెద్దలు అందరూ నడుంకట్టనిచో దేవాలయాలు సక్రమంగా నిర్వహింపబడవని శ్రీ Dr.TKNచారి గారు ఆందోళన వెలిబుచ్చారు.

## హైందవ ధర్మము

**హైందవ ధర్మము మూలము,**
**బంధువు; సృష్టిని విశేష పరచుచు దెల్పెన్**
**అందుండి యుద్భవించెను**
**పొందైన మతము లికెన్నొ పాలుపుగ భువిలో.**



# 'విశ్వహిందు'

సంపుటి : 11 సంచిక : 4 ఈశ్వర - చైత్రం ఏప్రిల్ - 1997

ప్రధాన సంపాదకులు :

**ప్రొ. బి. రామరాజు**

సంపాదకులు :

**బింగళి సుందరరావు**

సలహా మండలి :

**శ్రీ పి.వి.యస్.నాయుడు**

**డా. కసిరెడ్డి వెంకటరెడ్డి**

చందా వివరములు

జీవిత సభ్యత్వం రూ. 500.00

వార్షిక చందా - రూ. 50.00

విడిప్రతి - రూ. 5.00

డి.డి.లు **'విశ్వహిందు'**

అని మాత్రమే పంపవలెను.

చిరునామా :

'విశ్వహిందు'

4-5-212, "విజయశ్రీ"

కోఠి, భాగ్యనగర్ - 500 095.

ఫోన్: 517799, 591322.

ఈ సంచికలో ........ పుట



ముఖచిత్రం: శ్రీరాముడు - సమర్థరాముడు

సంపాదకీయం: **'రాం, రాం'**

''చైత్రేమాసి జగద్బ్రహ్మాససర్జప్రథమేఽహని....'' చైత్రశుద్ధపాడ్యమి సూర్యోదయ సమయానికి బ్రహ్మసృష్టి నంతయు పూర్తి చేశారట. ఇది 'ఈశ్వర' నామ నూత్న సంవత్సరము.

చైత్ర, వైశాఖాలు వసంత ఋతువు. ప్రకృతి మూడుపూవులారుకాయలుగా కళకళ లాడుతుంది. మానవాళికానందదాయకము చైత్రారంభము. కాగా...

చైత్రశుద్ధనవమి- శ్రీరామనవమి. శ్రీమన్నారాయణుడు నరజన్మ మెత్తి (శ్రీరాముడుగా) రావణాది రాక్షససంహారకుడై ప్రజలకు 'రామరాజ్యం' అందించి ధర్మ పాలన చేశాడు యుగయుగాల క్రితం.

నేటివున ధ్యేయువుూ 'రావుురాజ్య' స్థాపన. కాగా శక.సం॥1530లో చైత్రశుద్ధనవమినాడు శ్రీరామనవమి ఉత్సవంలో శ్రీసమర్థ రామదాసు (నారాయణుడు) జన్మించాడు. ఏప్రిల్ 16 సమర్థరామదాసు జయంతిజరుపుకుంటాము.

సమర్థరామదాసు జన్మించే నాటికి భారతదేశం ఉత్తరం నుండి మొగలాయిల, దక్షిణాన షాహీలు, సుల్తానుల దాడులతో హిందూ దేవాలయాల విధ్వంసాలు, కులస్త్రీల అరక్షణ మొ॥అరాచకాలతో అతలాకుతలమైపోతున్నది.

శ్రీవున్నారాయుణుడు రావుుడై రాక్షససంహారంచేసిన ట్లేనారాయుణుడు, (సమర్థరామదాసు) చిన్నతనంనుండికోతిచేష్టలు చేస్తూ చివరకు హనుమంతుని దర్శనం పొందిరామదాసుగా బజరంగదళ్ నాయకుడుగా ప్రసిద్ధిచెంది కోదండధారియై శ్రీరాముని ఉపాసిస్తూ ప్రతిచోటా శ్రీరామనవమి ఉత్సవాలు ఆనాటి ప్రజలలో ధైర్యం, స్వాతంత్ర్యేచ్ఛ, ఆత్మవిశ్వాసం, ఏకపత్నీవ్రతం మొ॥సద్గుణాలు కల్పించేవిగా ఉండాలన్న ధ్యేయంతో చేయించేవాడు.

ముసల్మాన్ 'జోహార్' కు బదులుగా ''రాం,రాం'' అని హిందువులు పరస్పరం పలకరించుకొనే ఆచారానికి శ్రీసమర్థరామదాసే ఆద్యుడు.

నారాయణుడు రామభక్తుడై సన్యాసిగా తీర్థయాత్రలు చేయుటకిష్టపడని తల్లివానిని కలసి 'నిన్నేదో భూతమావహించిందిరా' నాయనా అంటే 'అయోధ్యరాముడేనన్ను పట్టుకున్నా' డన్నాడుట. అంతటితో ఆగక...

తీర్థయాత్రల అనంతరం విధర్మీయుల, విదేశీయుల చేతిలో విలవిలలాడుతున్న భారతాంబ చెరబాపుటకు ఛత్రపతి శివాజీకి గురువై మార్గదర్శనం చేశాడు. రాజకీయ పరిస్థితుల్ని చర్చించి శివాజీకి ధైర్యాన్నిచ్చి తనతరపున రాజ్యాన్నిపాలించమని ప్రోత్సహించిన రాజఋషి.

శ్రీరామనవమినాడు జన్మించిన, సమర్థరామదాసు, బ్రహ్మచారిగా, సాధువుగా, సన్యాసిగా తీర్థయాత్రలతో కాలం గడిపి స్వీయమోక్షానికే ప్రాముఖ్యమివ్వక దేశం, ధర్మం, సమాజం

కొరకు తనతపశ్శక్తినంతయూ ధారపోసి శివాజీచేత హైందవసామ్రాజ్యాన్ని స్థాపింపజేసి శివాజి గతించిన (1680) మరుసంవత్సరమే (1681లో) పరమపదించాడు.

మరిమనం శ్రీరామనవమి వేడుకలు-శ్రీరామ చంద్రునిపేరుతోనే కాక, శ్రీసమర్థరామ దాసు యొక్క సంకల్పం, ధ్యేయము పెనవేసి నేటి భారతదేశంలో సూడోసెక్యులరిజం పేరుతో హిందువులకు జరుగుచున్న అన్యాయాలకు చరమగీతోత్సవాలు గామార్చిననాడే, ఈశ్వర శ్రీరామనవమి - హైందవ జాతిశ్రీరాముడ్ని, సమర్థ రాముడ్ని పట్టుకున్ననాడే పరమ పవిత్ర మౌతుంది కదూ! అందుకు బజరంగదళ్ ముందుకురకాలి.

అపుడే ఉగాది ప్రారంభమూనూ!! అదే ప్రతిభారతీయునిధర్మమున్నూ!! బ్రహ్మాస్త్ర ఫలమున్నూ.

'రాం, రాం'

**'రామదాసు' సమర రాముడై వెలుగొందె,**
**'రామనవమి' జరుపు రామభక్తు**
**లార! హిందుజాతిగౌరవంబును పెంచ**
**విశ్వహిందు వాణి వినుడు వినుడు**

**-సుందరం.**

## కరవాలము

- ఐతాచంద్రయ్య

చెబుతాను చెబుతాను నేను కవిత చెబుతాను
నీతిలేని రీతులను నిప్పుల కడిగేస్తాను
అండపిండ బ్రహ్మాండాన్నందించిన నాజాతిని
రచ్చబండ మీద పచ్చికుండవోలె నిలబెట్టిన
పుండాకోర్ దద్దమ్మల పండబెట్టి తొక్కేందుకు
క్రుధిత జగన్మాత హస్త త్రిశూలమై పోతాను. ॥చెబు॥
భరతమాత సిందూరం భాగ్యనిలయ కశ్మీరం
బద్మాషుల, బటాచోర్ల పాల్జేసిన పాపాత్ముల
గుట్టుబట్ట బయలు జేసి, జుట్టుబట్టి నేలగొట్టు
జగజెట్టీ నేత చేతి వజ్రాయుధ మౌతాను ॥చెబు॥
అధికారం అందలాన పదవుల పెదవుల కొరకై
జాతినీతి లేని విజాతీయ విధర్మీయులకై
కంచాలను మోసిమోసి, లంచాలను మేసిమేసి
తెగబలిసిన ఆంబోతుల సింహస్వప్న మౌతాను ॥చెబు॥
దిక్కు దివాణం కరువై కుక్కలుగా చరిస్తున్న
దేశీయుల మభ్యపెట్టు దగాకోర్ల అంతముకై
నింగిలోని చుక్కలను దిక్కుల ముంగిళ్లలోన
అక్షరాలుగా కూర్చి ఆయుధాలు చేస్తాను ॥చెబు॥

# ఉగాది విశిష్టత

మన సమాజంలో అనేకవేల సంవత్సరాలనుండి అత్యంతానందోత్సాహాలతో జరుపుకొనబడుతున్న పండుగలు, ఉత్సవాలు, జయంతులు, తిరునాళ్ళు యిత్యాదులు మన ధర్మ సంస్కృతులకు జీవనాధారాలు. ఇండ్లలో కుటుంబసంస్కారాలవలన వ్యక్తి శీలనిర్మాణం జరిగినట్లే హిందూ పర్వోత్సవాల సామూహిక సంస్కారాల ద్వారా సమాజశీలనిర్మాణము, వికాసము సంఘటన, జాతీయతా పరిపోషణ జరుగుతూవచ్చాయి. మన పండుగలు వివిధోద్దేశ్యాలతో వివిధ ప్రయోజనాలతో, వివిధధర్మాల సాధనోపాయాలుగా, వివిధసమయాలలో ఏర్పడినవి. పలువిధ ప్రయోజనాలతో ప్రకాశిస్తూన్న మన పండుగలలో ''ఉగాది'' ప్రకృతి పరిమాణాలను వాటి విలువలను తెలయజేస్తూ వ్యక్తి, సమాజాల భవిష్యత్తును సూచించి మార్గదర్శనంగావించే మహత్తరమైన పండుగ.

పురాణేతిహాసాలలో తెల్పబడిన ఉగాది దిన వైశిష్ట్యం అనన్యసామాన్యం:-

1. శ్రీ మహావిష్ణు, మత్స్యావతారుడై సోమకుని బారినుండి వేదాలను కాపాడితెచ్చి బ్రహ్మదేవునకప్పగించిన చైత్రశుద్ధపాడ్యమినాడే - ఉగాదినాడే బ్రహ్మ సృష్టి ప్రారంభించాడట.

2. ఆర్యులకు 6 నెలలు పగలు 6 నెలలు చీకటి. వారికి అరుణోదయం దర్శనమొక గొప్ప అనుభూతి - ఆ తొలి అరుణోదయదినమే ఉగాదిగా భావించబడినది.

3. జగద్విఖ్యాతుడగు విక్రమార్క చక్రవర్తి చైత్ర శుద్ధ పాడ్యమినాడే పట్టాభిషిక్తుడగుట వలన, ఆ మహావీరుని సంస్మరణదినంగా ఉగాది పండుగ జరుగుతున్నదని చరిత్ర కారుల అభిప్రాయం.

4. ఈ ఉగాదియే హస్తినాపురంలో యుధిష్ఠిరుని పేరట యుధిష్ఠరశకారంభదినమైనది. ఇలాగే ఉజ్జయినీ విక్రమార్కుని పేర విక్రమశకము, పైఠాన్‌లోని శాలివాహనుని పేరట శాలివాహనశకము, గౌరదేశంలోని నాగార్జునిని పేరిటి నాగార్జునశకం, సింధు సంగమంలో విజయాభిస్పెదను పేరట నుకర్నాటకలో త్తల్కిపేరిటను ప్రశిద్దశకాలు ఏర్పడ్డవి.

కేవలం ఆంధ్ర ప్రదేశ్‌లోను - హిందూ దేశంలోనే యీ పండుగ వివిధ రూపాలలో వివిధనామాలతో యితర రాష్ట్రాలలోను, యితర దేశాలలోను జరుపుకొనబడుతున్నది. మహారాష్ట్రంలో ఉగాదిని ''గుడి పదవా'' అంటారు. అస్సాంలో దీనికి ''బిహూ'' అని పిలుస్తారు. సిక్కింలో సంగ్ అంటారు. పంజాబీలు వైశాఖంలోనూ, తమిళులు, బెంగాలీలు - చైత్రఫాల్గుణమాసాలలోనూ, మళయాళీలు యించుమించు తెలుగు వారి పద్ధతిలోనూ, ఉగాది పండుగ జరుపుకుంటారు. ప్రాచీనరోమన్లు ఉగాదినాడు పచ్చని చెట్టుకొమ్మల్ని బంధుమిత్రులకు బహూకరించేవారట. చైనాలో ఉగాదిని చింగ్ మింగ్ అంటారు. ఆఫ్రికాలో ఉగాదినాడు రుచికరమైనవంటకాలు జేసికుంటారు. గ్రీకులు మన ఉగాది పచ్చడివలెనే ''హగ్గిస్'' అనే పండ్లు గుజ్జును వండుకుతింటారు. ఇలా ప్రపంచపరివ్యాప్తంగా ఉగాది పండుగ జరుగుతున్నది.

ఇక యీ ఉగాది పండుగ నిర్వహణంలో యిమిడివున్న వైజ్ఞానిక విలువలు అశ్చర్యకరాలు. ఉగాది సమయంలో ప్రకృతిలో కలిగే పరిణామంలో గల వైజ్ఞానికరహస్యాలు అత్యద్భుతాలు.

మనమానాడు ప్రభాతసమయంలో అభ్యంగనస్నానం చేస్తాము. ఆసమయంలో సూర్యమండలంలోనున్న ''రోచన'' అనే కాంతి సరుస్సు బాగా సంచలితమౌతుందనీ అప్పుడు ప్రసరించే బాలసూర్యకిరణాలు సోకుతువుండగా శిరస్సునుండి జాలువారే నీరు చెవులకున్న బంగారు

కర్ణాభరణాలమీదుగా భుజాలపైగల ''బ్యాలెన్సింగ్ నర్వ్సు'' పైబడటంవల్ల, బుద్ధ, వరిబీజము, మూత్రపిండవ్యాధులు రాజాలవని వైద్యవిజ్ఞానం తెల్పుతున్నది.

ఆరోజున మనం ఉగాది పచ్చడి చేసుకోని తింటాము. ప్రకృతి ప్రసాదించిన తాజావస్తువులైన కొత్తబెల్లం, క్రొత్తచింతపండు, ఉప్పు, వగామిడిపిందెలు, వేపపూత, గసగసాలు పచ్చిమిరపకాయముక్కలు, కొన్ని ప్రదేశాల్లో నెయ్యి మున్నగువాని కలిపి, తీపి, వగరు, పులుపు, ఉప్పు, చేదు, కారం అనే 6 రుచులు గల పచ్చడిగా యీ ఉగాది పచ్చడిని తయారుచేస్తాము. ఈ పచ్చడి జీవితంలోని సుఖదుఃఖాది వివిధానుభవరుచులకు ఉపలక్ష్యంగా విలసిల్లుతుంది. రానున్న సంవత్సరంలో కలుగనున్న వివిధానుభవాలను సమానంగా స్వీకరించటానికి ఉద్యుక్తతను ప్రకటించటమే యీపచ్చడిని స్వీకరించటం గల పరమార్థం. ఇక యీ పచ్చడిలో కలిసే వస్తువుల గుణవిశేషాలు చాలగొప్పవి - స్థలాభావం వల్ల కొన్నింటి విశేషాలనే తెల్పుతున్నాను.

వేపపూత:- వేపలో క్రిమినాశక, క్రిమినిరోధక లక్షణాలున్నందున, మైక్రోపైలేరియా, వైబ్రియోకలరా, కెబ్సియెల్లానిమోనియా, శాల్మోనెల్లా మొదలైన రోగాలక్రిములను యిది అరికట్టుతుంది. అందుకు వేపపుల్లతో పళ్ళుతోముకోవటం శ్రేష్టమన్నారు. పిల్లలకు అమ్మవారుపోస్తే వేపాకురసం పసుపుతో కలిపి వంటికి పూస్తారు. వేపవేళ్ళనుండి తీసినకల్లు రోగాలను నివారిస్తుందన్న నమ్మకం జనానుభవంలో వున్నది. వేప చెట్టు పెరిగే పరిసరాల్లో అంటువ్యాధులు సోకవు - వేప బెరడు లోపలి పొరతో తయారుచేసే కషాయం జ్వరాలకు, వాంతులకు, చర్మవ్యాధులకు దివ్యౌషధంగా పనిచేస్తుంది. ఈకషాయాన్ని తేనెతో కలిపిసేవిస్తే పచ్చకామెర్లు, చర్మవ్యాధులు నయమౌతాయి - వేపనూనెతో తయారుచేసిన సబ్బులు జిలలుతగ్గిస్తాయి వేప చెట్టుకు రంధ్రం చేసి అందులో కొంచెం అన్నం వేసి - బిరడా తోమూసి బంక మట్టితోకప్పి పదిలంగా వుంచి ఆమెతుకులను కుష్ఠువారికి తినిపిస్తే కుష్ఠునయమౌతుంది. వేపగాలి క్షయ వ్యాధిని ఉపశమింపజేస్తుంది. ఆయుర్వేదంలో చెప్పబడిన పంచతిక్తఘృతంలో మొదటి మిశ్రమం వేప. ఈఘృతంలో 80 రకాల వాతరోగాలు, 40 రకాల పిత్తరోగాలు, 20 రకాలశ్లేష్మవ్యాధులూ నయమౌతాయని వ్రాశారు. వాతం, ప్లీహం, పాండు మొదలైన మొండి వ్యాధులను నయం చేసే నింబూది చూర్ణంలో అధికంగా కలిసేది వేపయే - వేప చివురురసం రక్తవాత కఫ పిత్తదోషాలు హరిస్తుందని ఆయుర్వేదం చెప్తున్నది. వేపపువ్వును నూనెలో నెయ్యిలో వేయించుకొని తింటారు. పట్టువస్త్రాలను కీటకాల బారినుండి రక్షించుకోవటానికి వేపాకును వాడతారు. వేపాకు, పువ్వు, పండ్లు, వేళ్లు, బేరడు కలిపి పంచ నింబ అనే ఔషదాన్ని తయారుచేస్తారు - ఇది పామువిషాన్నికూడ విరచివేస్తుందట. వే ఏ పిట్టలో నైట్రోజన్, పొటాసియమ్, భాస్వరం, కాల్షియం, మెగ్నీషియం,అధికంగా వున్నందున ఇది సర్వశ్రేష్టమైన ఎరువుగా భావించబడుతుంది. ఇంకా ఎన్నెన్నో విశేషాలు వేపలో యిమిడివున్నవి. అందుకేవేపవేయి విద్యలమేలుచేస్తుందంటారు పెద్దలు. ''నింబపత్రం స్మృత్సంనేత్రం'' అన్నారు దీన్నిబట్టి వేప నయనాలకు మంచిదని తెలుస్తుంది.

''నింబవృక్షస్యపుష్పాణి, పిత్తాఘ్నాని విశేషతః

తిక్తాని చక్రివిఘ్నాని తథా కఫహరాణిచ'' (నిఘంటురత్నాకరం)

అందుకే వేపపూత పచ్చడిసేవనం జరుగుతుంది.

బెల్లం:- ఇది సాధారణంగా వాతోదరరోగాలను, జ్వరము, శైలలు, నులిపురుగులు, ఒడలిలో నీరును ఉపశమింపజేసి బళాన్నిస్తుంది. స్త్రీ సంభోగానంతరం తులమెత్తు పాత బెల్లం తింటే

నీరసముండదు – ముఖ్యంగా మశూచిపడిన వారికి, బాలింతలకు, యిది పథ్యకారి. ఇలా ఒక్కొక్క వస్తుగుణ విశేషాలను గూర్చి వ్రాయుటకు చిన్న వ్యాసం చాలదు. ఉగాదితో వసంత ఋతువురావటం వల్ల ప్రజలకు ఎంతో ఆనందం కల్గుతుంది. వసంతంలో విరబూసే పుష్పాలు – యీ పూవుల వాసనలు అనేక రోగాలకు దివ్యౌషధాలుగా ఉపయోగపడుతవి – ఈ పూవులలో గులాబి, కమలం, మల్లె – కుముదిని – వాసంతి – చామంతి – కేతకి – గుల్బహార్ – కేనూ – నదబహార్ – సూర్యముఖి – మొదలైనవి చాలా ప్రయోజనకరాలు. ఉదాహరణకు గులాబీ విశేషాలను గూర్చి ముచ్చటిస్తే అది శారీరక రుగ్మతలను అనేక విధాలుగా రూపుమాపి ఆరోగ్యాన్ని ప్రసాదిస్తుంది. గులాబీలో తయారైన ఔషధంసేవిస్తే ఉదరమూ, మూత్రపిండాలు శుద్ధి అవుతాయి. కళ్లు మెదడు చురుకుగా తయారువుతాయి. గులాబీరేకులను రోజూ తింటే జీర్ణశక్తి పెరుగుతుంది. తేనెలో తింటే గొంతు వ్యాధులు పోతాయి. గులాబీ పరిమళం తలనొప్పిని తగ్గిస్తుంది. గులాబీతో తయారుచేసిన ''గుల్కంద్'' అనే ఔషధం ఎంతో రుచిగావుంటుంది. ఇది నరాల బలహీనతను తగ్గిస్తుంది. గులాబీరేకులను నలిపి కనురెప్పలకురాస్తే కళ్లకు చలువచేస్తుంది. గులాబీ రోజ్‌వాటర్ చర్మవ్యాధులను నివారిస్తుంది. ఇలా ఎన్నెన్నో ప్రయోజనాలు గులాబీలవల్ల కలుగుతవి. అలాగే చంప, చామంతి – రక్తశుద్ధినికల్గిస్తాయి. గెండా పువ్వురసం చెవి వ్యాధులను నయంచేస్తుంది – నద్‌బహార్ ఆకులు బ్లడ్ కాన్సర్‌కు ఔషధంగా ఉపయోగపడతాయి. ఈ విధంగా వసంతంలో విరబూచే పుష్పాలవల్ల మానవులకు ఆరోగ్యంకల్గుతుంది – ఆహ్లాదం కల్గుతుంది. నవోత్సాహం కల్గుతుంది. పువ్వులను తల్లోధరించటం వల్ల స్త్రీలకు ఎన్నెన్నో ప్రయోజనాలు సిద్ధిస్తాయి. స్థలాభావం వల్ల వివరించటం లేదు.

ఇలా సృష్టిమానవజీవనానికి నూతనోత్సాహాన్ని ప్రసాదించేది ఉగాది పండుగ – ఆనాడు పంచాంగ శ్రవణంచేస్తాం – ప్రకృతి జీవితంలోనూ వ్యక్తిజీవితంలోనూ సమాజ జీవితంలోనూ రాబోయే మార్పులను గూర్చి పంచాంగం విస్పష్టంగా తెలియజెప్పి మార్గదర్శనం చేస్తుంది.

హిందువుల పండుగలలో యిమిడివుండే, ధార్మిక, సామాజిక, ఐతిహాసిక, వైజ్ఞానిక రహస్యాలనూ విలువలను అవగతం చేసుకొని ఆచరిస్తే ఈజాతి సుసంఘటితమై, జాగృతమై, తిరిగి మనపూర్వాన్నత్య కీర్తి శిఖరాగ్రాలను అధిష్ఠించి విశ్వగురువుగా, ప్రకాశించగలదనటంలో అణుమాత్రమైనా సంశయించనవసరంలేదు.

## వార్తలు

కాకినాడ : లో శివరాత్రి పర్వదినానశివునికి జలాభిషేకాలు, రుద్రాభిషేకాలు వి.హిం.ప. అధ్వర్యంలో నిర్వహించారు ఆసందర్భంలోనే అయోధ్యలో రామాలయనిర్మాణానికి, గోవధ నిషేధానికి ప్రభుత్వం చట్టం చేసే బుద్ధిని కల్పించి తద్వారా లోక కల్యాణం జరిగేట్లు చేయుమని ప్రార్థించారని శ్రీ కె.వి.రమణమూర్తి తెలియజేశారు.

కలువకుర్తి:లో 7-3-97న సత్సంగ వార్షికోత్సవము వి.హిం.ప. కార్యకర్తల అధ్వర్యంలో జయప్రదంగా నిర్వహించబడ్డది, అని శ్రీయాదగిరి తెలిపారు.

రంగంపేట: లో శివరాత్రి నాడు సహస్రదీపారాధన, మహన్యాస పూర్వక రుద్రాభిషేకాలు, 'శివరాత్రి ఏమిటి? ఎందుకు' అన్నకరపత్ర వితరణ జరిగినట్లు శ్రీ విశ్వనాధశర్మ తెలియజేశారు.

తణుకు: లో శివరాత్రి నాడు శ్రీ సిద్దేశ్వర స్వామి దేవాలయానికే తెంచిన భక్తులలో 800మంది సంతకాలు సేకరించి 'గోహత్య నిషేదం' చట్టం చేయుటకై స్థానిక మండల రెవెన్యూ అధికారి ద్వారా ప్రభుత్వాన్ని అర్థించారని శ్రీమతి కళ్యాణిగారు తెలిపారు.

# శ్రీ రుద్రమ్ - శక్తి

- Dr. M. V. R. శర్మ

యాత ఇషు శ్శివతమా శివం బ భూవ తే ధనుః
శివా శరవ్యాయా తవ తయానో రుద్ర మృడయ ॥

ఓ రుద్రుడా! మిక్కిలి శాంతమైన నీ బాణముతో, నీ అమ్ముల పొదితో, నీ ధనుస్సుతోనూ మమ్ములను సుఖింప జేయుము.

మొదటి మంత్రంలో పరమేశ్వరుని కోపానికి మనం నమస్కరించినాము. ఈ మంత్రంలో శాంతములయిన ఆయుధములకు ప్రణమిల్లుతున్నాము. ఆయుధాలు శాంతములెలా అయినాయి? మన శరణాగతి వల్ల అంతభయంకరమైన ఆయుధాలూ, ఆయుధాలను నిలువ వుంచే విభాగాలూ, పరికరాలూ శాంతములైనాయి. ఆయుధాలు మనకు సుఖాన్ని అందివ్వటమేమిటి? అంటే మామూలుగా ఆయుధాలు హింసించేవే అయినా అవి దుర్మార్గుల పైన మాత్రమే ప్రవర్తిస్తే, ఈశ్వరుణ్ణి శరణు జొచ్చిన సన్మార్గులకు హింస లేదు. పైగా దుర్మార్గులు దండెత్తి వస్తారన్న భయమూ లేదు. శక్తి వున్నంత వఱకే శత్రు భయం వుండనిది. మనం ఎంత గొప్ప వాళ్లమయినా నిరాయుధులుగా, అశక్తులుగా, వున్నప్పుడు శత్రువులకు చులకన అవుతాము. కఱవకపోయినా కనీసం బుసకొట్టని పాముకు ఆత్మరక్షణ కూడా దుర్లభమే కదా! కనుక శక్తి వుండాలి కానీ ఆ శక్తి ప్రసరణ దుష్టుల పైనే వుంటూ, మంచి వారికి రక్షణ కలుగ జేస్తుండాలి.

ఆధునిక యుగంలో కూడా ఆయుధ సంపత్తి లేని దేశాలు ఇరుగు, పొరుగు రాజ్యాల దురాక్రమణకు గురి కావటం మనం ఎరిగిన సత్యం.

ఎంతో శక్తివంతుడయిన భగవానుని ప్రసన్నుడుగా చేసుకొనుటకు ఈశ్వరుని శరణుజొచ్చుట ఎంత ముఖ్యమో కూడా తెలియుచున్నది. అల్పవిద్య, అల్ప శక్తి మొదలైన వాటితో కొందరు విర్ర వీగుట నిత్య జీవనంలో చూస్తూవుంటాం. ఒక మాఱు గాలి, అగ్ని మొదలైన దేవతలు తమ తమ శక్తులను గురించి ప్రగల్భములు చెప్పుకుంటూ వుండగా, ఈశ్వరుడు యక్షరూపములో ప్రత్యక్షమై ఒక గడ్డి పరకను వారి ముందుంచగా వాయుదేవుడు ఆ గడ్డి పఱకను కదల్చ లేక పోయినాడు; అగ్ని దేవుడు దానిని మండించనూ లేక పోయినాడు. కనుక తమకు గల శక్తి యుక్తులు అన్నీ కూడా ఆ ఈశ్వరుని యొక్క అంశగానే భావించి, వాటిని సమాజ సౌఖ్యానికి ఎలా వినియోగిద్దామా అని యోచించాలి కానీ గర్వించ గూడదు.

పై మంత్రములో ''మమ్ములను'' సుఖింపజేయమని యే ప్రార్థన. ''నన్ను'' సుఖింప జేయుమని కాదు. 'నః' అనగా మమ్ము అని అర్థము.

ఈశ్వరుణ్ణి ప్రార్థించుట లో స్వార్థములేదు. సర్వేజనాస్సుఖినో భవన్తు అని కదా మన సంస్కృతి ఉద్ఘోషించింది. వేదములో ''కేవలాఘో భవతి కేవలాదీ'' అని కేవల స్వార్థపరుడు ఏ మాత్రం పుణ్య సంసర్గం లేని కేవల పాపియే అవుతాడని వున్నది. ఏక స్వాదున భుంజీథ'' అనగా మంచి పదార్థమేదీ ఒంటరిగా తినకూడదు. అనుటలో కూడా ఈ అర్థమే ద్యోతకం అవుతున్నది.

# ఆదర్శజీవనం

-చన్ద్రమౌళిశాస్త్రి

ఏ పనీ చేయకుండా ఎవరూ, ఒక్క క్షణం కూడా వుండలేరు. దేహం పని చేయకున్నా మనస్సు పనిచేస్తూ వుంటుంది.

ఫలానా పనిచేస్తే ఫలానా ప్రయోజనం వుంటుందీ అని అనుకున్నప్పుడే మనిషి సామాన్యంగా పని చేస్తుంటాడు. కష్టం లేని పని వుండదు. కష్టించి చేసే పనికి సుఖం అనేది ఫలితంగా వుంటే కష్టాన్ని లెక్క చేయక, లేని ఓపిక తెచ్చుకొని ఆ పనిని చేస్తుంటాడు మానవుడు.

సుఖం ఈ జన్మలోనే కావాలని కొందరూ, చచ్చిపోయిన తర్వాత కూడా స్వర్గసుఖం గానో లేకపోతే పునర్జన్మ రూపంలోనో ఆ సుఖాన్ని పొందాలని మరి కొందరూ అనుకుంటారు. అందుకోసం 'పుణ్యకార్యాలు' చేస్తారు. దానాలూ, ధర్మాలూ, గుళ్లూ గోపురాలూ సందర్శించటాలూ చాలామంది అందుకే చేస్తుంటారు. మోక్షం కోసం మరి కొందరు పాటుపడుతుంటారు.

కానీ, ఈ ఇహలోకసుఖం, పరలోకసుఖం వీటిని మించిన సుఖాలు కూడా వుంటాయి. బాగా ఆకలిగా వున్న వొక వ్యక్తికి కడుపునిండుగా భోజనం పెట్టి, ఆ తర్వాత ఆ వ్యక్తిని గమనించండి. అతని ముఖాన్ని చూడండి ఎంత తృప్తి ఆ ముఖంలో?

దప్పిక గొన్న బాటసారికి మంచి నీళ్లందివ్వండి. దాహం తీరిన అతనితో ఎంత ప్రసన్నత?

ఈ తృప్తీ, ఈ ప్రసన్నతా ఆ బాధితుల, ఆర్తుల దుఃఖం పోయినప్పుడు చూసి, అనుభవ పూర్వకంగా తెలుసుకోదలిసిందే ఆనందించవలసిందే.

రోగుల సేవ కూడా ఈ విధమైన ఆనందాన్నిచ్చేదే.

రన్తి దేవుడు ఒకసారి 48 రోజులు నిరాహారంగా వుండవలసి వచ్చింది. ఆ తర్వాత ఆయనకు ఆహారం, నీళ్లూ లభించినాయి. అవి స్వీకరిద్దామనుకునే తరుణంలో ఆకలితో, దప్పితో వున్న వ్యక్తులు తారసిల్లారు. వెంటనే రంతి దేవుడు ఆ ఆహార పదార్థాలను ఆ ఆర్తులకు సమర్పించాడు, అప్పుడు రంతి దేవుడు యిలా అన్నాడు.

న కామయేహం గతి మీశ్వరాత్పరా
మష్టర్ధి యుక్తామ పునర్భవం నా
ఆర్తి ప్రపద్యేఖిల దేహ భాజామ్
అన్తస్థితో మేన భవన్త్య దుఃఖాః॥

''అష్టసిద్ధులు కావాలని నేను ఈశ్వరుణ్ణి అడుగను, జన్మా, మృత్యువూ వున్న ఈ చక్రం లోనుంచి ముక్తీ అడుగను. జీవులందరి లోనూ నేనేవుండి వారి, వారి కష్టాలన్నీ అనుభవించాలని నా కోరిక. దానితో వాళ్ల కష్టాలన్నీ దూరమవుతాయి గదా!

ఆ కొన్న ఈ ఆర్తులకు అన్నం, నీరూ సమర్పించినప్పుడే నా ఆకలీ, దాహం, అలసటా తీరిపోయాయి''

ఇతరుల కోసం కష్టపడుట లోనే నిజమైన సుఖం వుంటుంది.

# క్రాంత దర్శి అంబేద్కర్

( ఏప్రిల్ 14 అంబేద్కర్ జయంతి)

– డా॥ కసిరెడ్డి

అంబేద్కర్ భారత రాజ్యాంగ నిర్మాత. జాతీయవాది; సమాజసంస్కర్త; అస్పృశ్యత నిర్మూలనం నిమిత్తం జీవితాంతం పోరాడిన చైతన్యశీలుడైన మేధావి; పరిశోధకుడు; తనదైన దర్శనం చేత సమాజాన్ని ప్రభావితం చేసిన దార్శనికులు; మానవతావాది; సంఘటనా నిర్మాత; రాజనీతివేత్త; పరిపూర్ణ దేశభక్తుడు. **1891**లో జన్మించారు; **1956**లో పరమపదించారు.

## మతంవల్లనే మానవత్వం - దివ్యత్వం.

మతంవల్లనే మనిషిలో మానవత్వం నిర్మాణమవుతుందనీ, ఈ మనుషులు దివ్యమానవులై దివ్యులైపోతారని అంబేద్కర్ భావించారు. ''మానవునికి మతం చాలా అవసరం; కాని మతం పేరుతో మూఢనమ్మకాలను పెంచుకోవడం హానికరం'' అన్నారు వారు. మతంలో వ్యక్తివికాసానికి దోహదం చేసే అనేక నియమాలున్నాయి. తనలాగే సర్వజీవకోటులూ అని భావించి ప్రేమించమనీ, నీ ఆత్మ సర్వజీవుల్లోని ఆత్మ ఒక్కటే అనీ వ్యవహరించవలసిందిగా మతమే చెబుతున్నదనీ అంబేద్కర్ విశ్వసించారు. అందుకే మనిషికి మతంచాలా అవసరం అన్నారు వారు.

హిందూ దేశంలో ఇస్లాం-క్రైస్తవాలు మతం మార్పిడులను విపరీతంగా ప్రోత్సహించాయి. తమసంఖ్యను పెంచుకొని దేశాన్ని ఆక్రమించాలనే సామ్రాజ్యవాద దృక్పథంతో అవి వ్యవహరించాయి. ఈ నాటికీ ఈ దేశంలో ఈ రెండుమతాలు ఆ దృక్పథంతోనే తమ కార్యకలాపాలు కొనసాగిస్తున్నాయి. హిందూ దేశంలోని వైష్ణవ మతంకానీ, శైవమతంకానీ, గాణాపత్యం, శాక్తేయం, కాపాలికం, లోకామతం, నాస్తికమతం గానీ ఏవీ కూడా ఈమతాంతరీకరణల్ని నిరోధించి ఇస్లాం-క్రైస్తవాల దురాగతాల్ని ఎదిరించలేక పోయినాయి.

అవి ఆ దృష్టితో ప్రణాళికలు రచించలేదు; కార్యాకరణం లోకి అసలే దిగలేదు. బౌద్ధం, జైనాలు కూడా శుద్ధకార్యానికై ప్రయత్నించలేదు. స్వామిశ్రద్ధానంద, స్వాతంత్ర్యవీర సావర్కర్ వ్యక్తులుగా ప్రయత్నించారు. హిందూమహాసభ, శుద్ధిసభ, ఆర్య సమాజం తదితర సంస్థలు ప్రయత్నించాయి; కొంతవరకు విజయం సాధించాయి. అయినా వీటి వేగం పెరగాల్సి ఉంది. అంబేద్కర్ వీటిలో కొన్ని సంస్థలనూ వాటి కార్యకలాపాలనూ తనజీవితం చరమదశలో పరిశీలించారు. దళితులు తమను రక్షించే మతం వైపు మొగ్గుతారు కాబట్టి దళితులందరూ హిందువులే అనీ, వారికి అందరితో పాటే సమాన ప్రతి పత్తి ఉందనీ హిందుత్వం ఘోషించాలని వారు కోరారు.

''తనగురించి శ్రద్ధవహించే మతం కోసం దళిత ప్రజలు ప్రాణాలు ఇస్తారు. తమను గురించి పట్టించుకోని మతాన్ని వారు పట్టించుకోరు. మేము హిందూమతానికి చెందిన వారమా కాదా అనేది తేల్చిచెప్పాలి. అశుభ్రమైన దానిని శుభ్రపరచడమూ, అస్పృశ్యులను సాంఘిక సమానతాస్థాయికి ఉద్ధరించడమూ- ఇదే సంస్కృతి అంటే సరైన అర్థం:...''

## బౌద్ధం స్వీకరించడంలోని పరమార్థం :

ఆదిశంకరులూ, శ్రీమద్రామానుజులూ, బసవేశ్వరులు, బ్రహ్మనాయుడు, విద్యారణ్యులు

తదితరులెందరో అస్పృశ్యతనిర్మూలనానికి పాటు బడ్డారన్నది ఆయనకు తెలియక కాదు. సర్వజీవుల్లోని ఆత్మ ఒక్కటని విశ్వసించిన మతంలో అంటరానితనం పాటింపబడడం ఆయనను కలవరపిచింది. జీవితాంతం వరకు అస్పృశ్యతా నిర్మూలనానికి కృషిచేసి ఓడిపోయి, బౌద్ధం స్వీకరించారు. 1936 మే 31వ తేదీన నేను హిందుత్వాన్ని వదలి వేస్తాను అని ఆయన ప్రకటించారు. విదేశీమతాలవారు ( ఇస్లాం క్రైస్తవాలు) ఎగిరి గంతేశారు. కోట్లాదిరూ॥లు క్రుమ్మరించయినా అంబేద్కర్ను తమ మతంలోకి మార్చుకొంటే హరిజనులందరూ తమ గుప్పిట్లోకి వస్తారనీ, ఆ తర్వాత దేశాన్ని తమ మత రాజ్యంగా మార్చేసుకొని పరిపాలించ వచ్చని ఇస్లాం దేశాలు, క్రైస్తవదేశాలు ఆలోచించి రాయబారాలు సాగించాయి., కుతంత్రాలు, షడ్యంత్రాలు, దుస్తంత్రాలు పెరిగిపోయాయి.

అయితే అంబేద్కర్ వీటిలో వేటికీ తల ఒగ్గలేదు. అర్థం-అధికారం లాంటి ప్రలోభాలకు గురికాలేదు. తాను విదేశీ మతాన్ని స్వీకరిస్తే, తన వెంబడే లక్షలాది మంది హరిజనులూ స్వీకరిస్తే-హిందుత్వాన్ని గురించి మాట్లాడే హక్కే-తాము కోల్పోతామని అంబేద్కర్ గుర్తించారు. ఇంటిని శుభ్రం చేసుకోవాలంటే ఇంటిని వదలిపెట్టిపోవడం పిచ్చిపని అవుతుంది. క్రైస్తవ మహ్మదీయుల్ని స్వీకరిస్తే ఈ దేశం నాది అని చెప్పుకొనే హక్కు-కూడా కోల్పోతాం అనియనభావించారు. అందుకే హిందుత్వంలో అంతర్భాగమై, ఈధర్మ-దేశ-జాతిరక్షణల నిమిత్తం ఆవిర్భవించిన సిక్కుమతాన్ని స్వీకరిచాలని ఆయన నిర్ణయించుకొన్నారు. ఇక ఆయన సిక్కు అవుతారనే అందరును కొన్నారు. అయితే ఈ సంఘర్షణ వారిలో ఇరవై సం॥లు జరిగింది. హిందూత్వంలోనే ఉండాలి. అందులో దళితుల్ని తమతో సమానంగా చూచే మతాన్ని స్వీకరించాలి. 1956 అక్టోబర్ 14వ తేదీన ఆయన బౌద్ధాన్ని స్వీకరించారు. ఆసందర్భంలో ఆయన ఇలా అన్నారు.

''బౌద్ధం స్వీకరించడం ద్వారా దేశానికి సేవచేస్తున్నాను. ఎందుకంటే బౌద్ధమతం భారతీయ సంస్కృతిలో అంతర్భాగం. ఈమతం మార్పిడి వలన ఈ భూమిపై పరిఢవిల్లిన చరిత్రకు ఏవిధమైన హాని జరగదు.''

ఆయన ఎంతదేశభక్తుడో చూడండి! మతాంతరీకరణలు జరిగి విదేశీమతాలవారి సంఖ్యపెరిగిన ప్రదేశాలన్నీ ఈ దేశం నుండి విడిపోయినయ్; అవి పచ్చి మతరాజ్యాలుగా మారిపోయినయ్. ఆయన కళ్లముందు అఫ్ఘనిస్థాన్-పాకిస్థాన్లు ప్రత్యక్షంగా కనిపిస్తున్నయ్. మతం మారిన హిందువులను వారు నీచంగా చూడడం వారు గ్రహించారు. హిందుత్వంలోంచి బయటికి వెళ్లిపోయిన వ్యక్తి హిందుత్వం గురించి మాట్లాడే హక్కే-కోల్పోతాడు. ఏమైనా మాటాడితే బయట ఉండి రాళ్లు విసరే దుర్మార్గుడయిపోతాడు. శత్రుభావనతో వ్యవహరించిన వడై పోతాడు. మంచంలో నల్లులున్నాయని మంచాన్నే కాల్చినట్లవుతుంది. చూరులో ఎలుకలున్నాయని చూరుకేనిప్పంటించినట్లవుతుంది. ఇన్ని ఆలోచనల కారణంగా నూటికి 90%హిందుత్వంలోని సిద్ధాంతాలనే అనుసరించిన (సంఘం, ధర్మం, యోగం, జన్మ, పునర్జన్మ, కరుణ, జాలి, పవిత్రత, అవతారం, మూర్తిపూజ, దానం, ఇంద్రియనిగ్రహం, అహింస, సర్వప్రాణి సమానత్వం, అష్టాంగయోగం, ధ్యానం, కర్మయోగం, సత్యం, ఋజుప్రవర్తన, మృదుభాషణం, నిరాడంబరత) బౌద్ధాన్నే స్వీకరించాలని ఆయన నిర్ణయించి అమలులో పెట్టారు. అయితే ఆ తర్వాత వారు 52 రోజులు మాత్రమే బ్రతికారు.

సాంఘిక సమానత్వాన్ని, అస్పృశ్యతా నిర్మూలనాన్ని సాధించలేకపోయాననే అన్నతపన వారి అంత రాంతరాల్లో సంఘర్షణ సృష్టించింది. అందుకే వారు ఒక సందర్భంలో ఇలా అన్నారు.

''బాధలుపడే ప్రతి మనిషికీ నాయకుడుగా నేను ఎన్నడూ ప్రవర్తించలేదు. ఈ జీవితానికి

నాభుజస్కంధాలపైనున్న అస్పృశ్యత నిర్మూలన బాధ్యతచాలు. జీవితం చాలాచిన్నది. ఒక సమస్యకు ఒక జీవితం సరిపోతుంది.....''

గిరిజనుల సమస్యలను అంబేద్కర్ పట్టించుకోవడం లేదని ఎవరో వ్యాఖ్యానిస్తే వారు పైవిధంగా అన్నారు. 'ప్రతి మానవుడూ ఒకమహత్తర ఆశయం కోసంజీవిస్తూ తన మేధాశక్తినంతా అందుకే వినియోగించాలి' అన్నారువారు. ''దురాక్రమణ చేసే దుర్బుద్ధి ఉన్నవారెప్పుడూ దురాక్రమణ చేస్తూనే ఉంటారన్న విషయాన్ని మనం మరువ రాదు''....అని విదేశీయుల విషయంలో జాగ్రత్తగా ఉండాలన్నారు. మహమ్మదీయుల విషయంలో మరీ జాగ్రత్తగా ఉండాలన్నారు. భారతదేశాన్ని పాకిస్థాన్ హిందూస్థాన్‌లుగా విభజించి హిందువులనందరినీ హిందూదేశంలో ముస్లింలనందరినీ పాకిస్థాన్ దేశంలో ఉండేట్లు చేయాలన్నారు. ఈ మార్పిడి జరగక పోతే భవిష్యత్తులో తీవ్ర ఘర్షణలు వస్తాయన్నారు.

## మతవిభజనేకాదు - జాతివిభజనా జరగాలి.

దేశం మతం పేరిట చీలిపోతుంది. ఇది సత్యం. జాతులుకూడా ఆయా దేశాల్లోనే ఉండాలి. ముస్లింమెంటాలిటీ ముస్లింకాని వారి నెవ్వరినీ బతకనివ్వదు. అందుకే పాకిస్థాన్‌కు ముస్లింలందరూ వెళ్లిపోవాల్సిందే, అక్కడ ఉన్న హిందువులందరూ హిందుస్థాన్‌కు రావాల్సిందే అన్నారు అంబేద్కర్.

గాంధీనెహ్రూ ఈ విషయంలో కొద్దిపాటి స్పందించి ఉన్నా పీడపోయేది. ఇన్ని మత ఘర్షణలతో దేశం రక్తసిక్తమయ్యేది కాదు. ఈ నాయకులు దేశాన్ని కూడా విభజించనివ్వం అని వృద్ధసింహాల్లా జూలు దులిపినంత పనిచేశారు గాని, తామే స్వాతంత్ర్యం సంపాదించి పెట్టామన్న కితాబు కొట్టేయాలని చివరకు చీలికకు అంగీకరించారు. సర్దార్‌పటేల్, అంబేద్కర్, శ్యాంప్రసాద్ ముఖర్జీ మాటలను ఎవరూ పరిగణనలోకి తీసుకోలేదు. అంబేద్కర్ మాటలు మరోసారి మననం చేసుకోండి!

''మహమ్మదీయులు పరిపాలించే దేశంపట్లనే మహమ్మదీయుడు విధేయుడుగా ఉంటాడు. మహమ్మదీయేతరుల చేత పాలించబడే భూమి వారికి శత్రుదేశమే. ఈ కారణాల వల్ల నిజమైన మహమ్మదీయులనెవరినీ కూడా మహమ్మదీయమతం ఈ దేశాన్ని తమ మాతృదేశంగా, హిందువులను తన సోదరులుగా భావించనివ్వదు. సందేహాస్పద విధేయత కలిగిన ముస్లింలు భారతదేశానికి లోన ఉండి వ్యతిరేకించే కంటే, మహమ్మదీయుల సంఖ్యాబలాన్ని వదిలించుకోవడం మంచిది. కాబట్టి శాంతి, అభివృద్ధి, విమోచనల కొరకు భారతదేశాన్ని హిందుస్థాన్ పాకిస్థాన్లుగా విభజించాలి.''

అంబేద్కర్ స్పష్టంగా రెండు జాతుల పేరిట రెండు దేశాలు వేర్వేరైపోవాల్సిందే అన్నారు. కానీ గాంధీ నెహ్రూలు కరటక దమనకుల్లా అడ్డు తగిలారు. జిన్నాప్రత్యక్షచర్యకారణంగా ముస్లింలమతోన్మాదం కారణంగా హిందువులందరూ పశ్చిమపాకిస్థాన్-తూర్పు పాకిస్థాన్లను వదలి పెట్టారు. కాని ముస్లింలు మాత్రం హిందూదేశంలోనే ఉండిపోయారు. ఊచకోత కోసి హిందువులను పాకిస్థాన్‌నుండి తరిమివేస్తుంటే, కొత్త ప్రభుత్వం ప్రేక్షక బాధ్యతను వహించింది. ముసలికొడుకులకు కుర్చీ దక్కింది. కావిలికాచుకొని కూచున్నారు. వారు ఆనాడు అంబేద్కర్ మాటలను వేదవాక్యాలుగా స్వీకరించాల్సింది. కుర్చీదక్కింది; వారికదే పదివేలు!!

అంబేద్కర్ను వ్యతిరేకించేవారు ఏదేశంలో, ఏకాలంలో ఏ పరిస్థితుల్లో ఆయన ఎందుకు అలాచెప్పారనేది ఆలోచించాలి. ఆయన దేశభక్తి అర్థమవుతుంది; ప్రేమతత్త్వం తెలుస్తుంది. ఆయన భవిష్యద్రష్టఅని నిరూపితమవుతుంది. ఆయన ''క్రాంత దర్శిత్వానికి చేతులెత్తి దండం పెట్టాలనిపిస్తుంది.

# ఆది నుండి ఆధునికం వరకు - స్త్రీ

- డి.జి. విజయలక్ష్మి

''పరస్యా అధి సంవతో అవరాం అభ్యాతర యత్రాహ మస్మితాం అవ---'' ఇత్యాది మంత్రమునకు ఉత్తమురాలైన కన్య, తన కంటే అధికబలము, విద్యగలవానిని, లేదా సమానుని పతిగా స్వీకరించవలెను గాని చిన్నవానిని, తక్కువవానిని వరించకూడదని అర్థం. ఇంకా ఎలాటి వాడిని కోరుకో కూడదో కూడ అదే అధ్యాయంలోని 61వ మంత్రంలో చెప్పబడింది. ''అనున్నమ్ అయజమానమిచ్ఛస్తేన స్యేత్యామన్విహి --- ఇత్యాది మంత్రమునకు ఓ స్త్రీలార! మీరు పురుషార్థ రహితులు, దొంగలకు సంబంధించినవారిని స్వీకరించకుడు. సోమరులను, దానధర్మ రహితులగు పురుషులను కోరకుడు. నీతి కల్గినవారిని వరించుడు అని బోధించారు. ఇది ఆదేశంకాదు ఆకాంక్ష మాత్రమే. స్త్రీలకెంత స్వేచ్ఛ, ఉన్నత స్థానం వున్నాయో ఆమంత్రాలలోని సంబోధనవల్లనే తెలుస్తుంది, నిర్భతే, దేవీ అంటూ. నిర్భతే అంటే పృథివి వలెవుండుద్దానా! దేవీ అంటే రాణి, విదుషీమణి అని అర్థం.

కేవల సంభోదనలోనే కాదు, ఆమెను ప్రశంసిస్తూ చెప్పిన మంత్రమిది

''యస్త్రీరాడ్యన్త్యసి యమనీ ధ్రువాసి ధరిత్రీ----'' ఏ స్త్రీ భూమివలె క్షమాయుక్త, ఆకాశమువలె నిశ్చల, యంత్రికలవలె జితేంద్రియురాలునై యుండునో ఆమె కులదీపకురాలు కాగలదు. సామాన్యంగా వివాహమయ్యాక స్త్రీ భర్తనుగామిని. అయితే అతన్ని సత్కార్మయందు, సన్మార్గమందు ప్రోత్సహించవలసిన బాధ్యతకూడ ఆమేదే! అదికూడ ఒక మంత్రంలో చెప్పబడింది.

''విశ్వకర్మా త్వాసాదయతు---'' అంటూ. పురుషుడెట్లు స్త్రీని సత్కర్మలయందు నియోగించునో అట్లే స్త్రీయు తనపతిని, సుకర్మలయందు ప్రేరేపించవలయును..నాడు మనకందు బాటులో లేని, మన ఆధునికులకందని ఆలోచన ఆనాడాచరణలో వుండటం ఆశ్చర్యకరం! ఆమోదకరం!! అదేమిటంటే పురుషుడు ఎట్లు న్యాయాధికారమున అధిష్టితుడగునో, అట్లే అతని పత్ని స్త్రీలకు న్యాయము చేయుటకు అధికారపీఠమధిష్టించేదని తెల్పేమంత్రం 13వ అధ్యాయంలో 16వది. అంటే పురుషులకు రాజు న్యాయం చెప్పినట్లే స్త్రీల సమస్యలను రాణి పరిశీలించేవారు. ఎంత చక్కటి వ్యవస్థ! స్త్రీల కష్టసుఖాల్ని సాధకబాధకాల్ని స్త్రీయే బాగా గ్రహించగలదు. పైగా స్త్రీలు తమసమస్యల్ని స్త్రీముందు నిర్భయంగా, నిస్సంకోచంగా చెప్పుకోగలరు. మానవతులు తమబాధల్ని చెప్పుకోవటమే అవమానంగా భావిస్తారు. ఇక పురుషులముందుచెప్పవలసిరావటం ప్రాణాంతకంగా వుంటుంది. ఈ బాధలానాడు లేవన్న మాట! అన్న మాటేమిటి? ఉన్నమాటే, మంత్రాల్లో చక్కగా వివరించబడింది.

యజుర్వేదంలో నిత్య జీవితంలో మానవాళికి శిరోధార్యమైన విషయాలతో కూడిన మంత్రాలెన్నో ప్రతిపాదించ బడ్డాయి. పాలకుడు, ప్రజలు ఎలావుండాలో, ఎలా వుండదగదో, అలాగే గృహస్థుడు ఎలావుండాలి? సతి, సుతులయెడ ఏవిధంగా ప్రవర్తించాలి అనేది ఇందులో చక్కగా విశదంగా వుంది. అయితే అవి చదివి అర్థం చేసుకోలేని స్థితిలో వున్న మనం వేదాలంటే బాపనోళ్ల మంత్రాలనే మూర్ఖుల మాటలనే విశ్వసిస్తున్నాం! ఆనాడు కేవలం స్త్రీలే గురుకులాలు నిర్వహించి బాలికలకు విద్యా బుద్ధులు నేర్పేవారంటే వారంతటి విజ్ఞులో గ్రహించవచ్చు. పైగా వారి ఆశయం, ఆదేశం కూడ ఉదాత్తం!

20వ అధ్యాయం 85వ మంత్రంలో వారు తమ శిష్యుల కిచ్చిన సందేశం గమనిస్తే -

''చోదయిత్రీ సూనృతానాం చేతన్తీ సుమతీనాం యజ్ఞం దధౌ సరస్వతీ'' - అంటే- ఓ మహిళలారా! విద్యావతినైన నేను చక్కగా మీ కందరికీ ఎలా విద్య నేర్పుచున్నానో, అట్లే ఈ యజ్ఞమును మీరందరూ చేయుచూ తోటి మహిళలకు సుశిక్ష గఱపవలయును. దీనిని బట్టి పూర్వకాలంలో స్త్రీ బానిసకాదు స్త్రీ జాతికే బాసట అనే విషయం సువిదితం. శాస్త్రం, సాహిత్యమేకాక యుద్ధ విద్యా విశారదలుగా కూడ మనకు గోచరిస్తారిక్కడ.

మహిళామణులందరికీ మకుటాయమానంగా వెలిగినవిదుషీమణులందరికీ జోతలర్పిస్తూ, వారి స్ఫూర్తితో ముందుకుద్యమిద్దాం!

### అథర్వవేదంలో స్త్రీలు

ఇందులో వేదాంత పరమైన సూక్తులెన్ని వున్నాయో అంతకంటే ఎక్కువగా లౌకిక లక్ష్యాలతో కూడిన సూక్తులనేకం వున్నాయి. జబ్బులను, శత్రువులను నాశనం చేసే హోమాలకు చెందిన ప్రక్రియలు వశీకరణ మంత్రాలు అధికమిందులో, ఈ వేదంలో వున్న 20 కాండలలో స్త్రీ పురుషులకు సమానత్వమేకాని, తక్కువతనమెక్కడా కనబడదు. కొన్ని స్త్రీలు మాత్రమే చెప్పిన సూక్తాలు, స్త్రీలు మాత్రమే చేయదగిన హోమాలు కూడ కన్పిస్తాయక్కడక్కడ. 3వ కాండ నాల్గవ అనువాకంలోని 18వ సూక్తంలోని ఆరు మంత్రాల్లో స్త్రీ తన సవతిని జయించడానికి చేసే కర్మ చెప్పబడింది .

ఇది స్త్రీ స్వయంగా చదువుతూ హోమం చెయ్యాలని వుంది.

ఇమాం ఖనా మ్యోషధాం, వీరుధీం బలవత్తమాం

యయా సపత్నీం బాధతే, యయా సంవింధతే పతిం॥.

అనగా లతారూపమైన ఈ ఓషధినిత్రవ్వి పైకి తీస్తున్నాను. ఇది నా సపత్నిని బాధిస్తుంది. పతిని నాకేలభింపజేస్తుంది అని అర్థం. ఇలాటి మరో 5 మంత్రాలభావాలను గమనిస్తే - ఓ ఓషధీ - నా సపత్నిని పరాఙ్ముఖురాలను చెయ్యి. నాపతిని అసాధారణుడిని చెయ్యి అని ఒక మంత్రమునకు, (2) ఓ సపత్ని, ఇక నీపేరు కూడ తలపెట్టను. నా పతికి దూరంగా వెళ్లు (3) ఓ ఓషధీ, నీ ప్రభావము వలన నేను ఉత్కృష్టురాలనగుదును గాక (4) ఈ ఓషధిని నాభర్త యొక్క శయన స్థానం క్రింద భద్రపర్చుచున్నాను. దీని ప్రభావముతో నీమనస్సు ఆవు వెంటబడు దూడవలె నా స్వాధీనమగునుగాక (5) నా భర్త ఇతర స్త్రీల పేర్లను ఉచ్చరించకుండు గాక! శంఖపుష్పి అనే ఓషధీ, సర్వదేవ వశీకరణ సమర్థమైన నిన్ను ప్రసన్నం చేసుకొనుటకై స్తుతించుచున్నాను.

ఈమంత్రములను, వాటి భావాలను బట్టి చూస్తే ఆకాలంలో పురుషులు బహు భార్యాత్వం గలవారని, లేదా స్త్రీ వ్యామోహం కలవారని, తమ భర్తల ఆగమనం కోసం లేదా అనుగ్రహం కోసం భార్యలు హోమాలు చేసేవారని మన కవగతమౌతుంది. ఈ వేదంలో అన్ని వశీకరణమంత్రాలేనా అని సందేహించనక్కరలేదు. శత్రువులను నాశనం చేసేవి, రోగనాశకములైన మంత్రాలెన్నో వున్నాయి. ఎక్కువగా స్త్రీలు చెప్పిన మంత్రాలున్నాయన్నది గమనార్హం. మంత్ర ద్రష్టలు, సర్వశాస్త్రార్థ తత్త్వజ్ఞులైన ఆనాటి స్త్రీలు, పురుషుల చిత్తవృత్తిని, తమ ప్రజ్ఞాపాటవాలతో కైవసం చేసుకున్నారు గాని, ఈ నాటి స్త్రీలవలె పిరికితనంతో ఆత్మహత్యలు చేసుకోలేదని, స్పష్టమౌతుంది. భర్తల నిరాదరణకు గురై మానసిక దుర్బలత్వంతో ఆత్మహత్యలు చేసుకునే స్త్రీలు కోకొల్లలీనాడు ఇది స్త్రీ జాతి పురోగమనమా, తిరోగమనమా?

(సశేషం)

# ఆదిత్యహృదయం

(గత సంచిక తరువాయి) - డా॥ అల్లూరి వేంకట నరసింహరాజు

ఏడు వందల శ్లోకాలతో కూడిన భగవద్గీతను, నిత్యం పారాయణ చేయడం, ఎవరికైనా కష్టమే. ఆదిత్య హృదయంలో కేవలం ముప్ఫై యొక్క శ్లోకాలున్నాయి. దీనిని పఠించడానికి, ఐదు నిమిషాలకన్న ఎక్కువ సమయం పట్టదు. సూర్యుడుదయించడానికి, ఎంత కాలం పడుతుందో, సరిగా అంతసేటిలోనే, యీ స్తోత్రాన్ని పారాయణం చేయవచ్చు!

ఆదిత్యుడంటే సూర్యుడు. శాస్త్రాధారంతోనే కాకుండా, సామాన్యుడు సైతం, ప్రతిరోజు, స్వయంగా కళ్లతో చూడగల ప్రత్యక్ష దైవం సూర్యుడు. ప్రతిదినం మన కళ్ళ యెదుట కనిపించి, ప్రపంచాన్ని కనిపింపచేసే జగచ్చక్షువు సూర్యుడు.

''కవి హృదయం'' అన్న మాట లోకంలో ఉంది. కవి ప్రయోగించిన పదాల వెనుక అస్పష్టంగానున్న అతని మనోభావమని దాని కర్థం. ' ఆదిత్య హృదయం' అనే మాట వినేసరికి జీవ స్పందకమైన ఏదో రహస్యం ఈ మంత్రంలో యిమిడి యుంటుందనిపిస్తుంది.

'' ఆదిత్యుడు'' అన్నది సూర్యునికి గల నామాలలో ఒకటి, అతని కింకా మిత్రుడు, ధాత, ఆర్యముడు, అంశువు, భగుడు, వివస్వంతుడు మున్నగు అనేక నామాలున్నాయి. అందు ఆదిత్యుడు తన రూపమే నంటాడు కృష్ణపరమాత్మ భగవద్గీతలో.

కుల, మత, వర్గ, జాతి, లింగ వివక్షత లేకుండా, సర్వ జీవ కోటికి, ఆధారభూతుడైన శక్తి స్వరూపుడు ఆదిత్యుడు. ఆయన సజ్జనులకు, దుర్జనులకు, సంపన్నులకు, పేదలకు, పండితులకు, పామరులకు, జడములకు చేతనములకు కూడా అవసరమైన వాడు. అందుబాటులో ఉండేవాడు. ఆయన దేవతలకు శ్రేయస్సు (మోక్షము)ను, రాక్షసులకు ప్రేయస్సు (సుఖము)ను ప్రసాదిస్తాడట, సూర్యుని ప్రాతఃకాలమున ఋగ్వేదము, మధ్యాహ్నమున యజుర్వేదము, సాయంకాలమున సామవేదము ప్రస్తుతిస్తాయట!

ఆదిత్య హృదయంలో '' ఆదిత్యుడు'' ''హృదయము'' అనే రెండు పదాలున్నాయి. సూర్యుడు అదితి కశ్యపులకు పుత్రుడుగా అవతరించిన కారణంగా ఆదిత్యుడయ్యాడు. హృదయం అంటే, పుత్రుడని అర్థం. సూర్యుడు ఆకాశానికి పుత్రుడని శ్రుతివచనం. ఆదిత్యుడంటే సూర్యమండలము; హృదయమంటే తదంతరవర్తియై, ఆ మండలానికి, దానితో పాటు సమస్త లోకాలకు, తేజస్సును ప్రసాదించే మూర్తియని అర్థం. ఆధ్యాత్మిక పరిభాషలో హృదయమంటే పూజింప వలసిన దేవతామూర్తిని సర్వాంతర్యామిగాను, సర్వాధ్యక్షునిగాను భావించడం. ఆదిత్య హృదయావగాహన కలిగితే, అనంత జ్ఞాన సంపత్తి లభించినట్టే. భవిష్యోత్తర పురాణంలో కూడా ఒక ఆదిత్య హృదయం ఉంది.

సూర్యుడు తామస శక్తి (చీకటి)ని తగ్గించి సాత్త్విక (పగటి) భావాన్ని కలిగిస్తాడు. జీవరాసులకు చైతన్యం కలిగించి, ప్రపంచ వ్యవహారాలకు ప్రేరణ కలిగిస్తాడు. స్వర్గ నరకాలు ఎక్కడో లేవు. తమస్సుతో కూడిన రాత్రే నరకం! తేజస్సుతో కూడిన పగలే స్వర్గం! నరకం నుండి మనలను స్వర్గానికి చేర్చేవాడే ఆదిత్యుడు.

(సశేషం)

# ఛాందోగ్యోపనిషత్ విశేషాలు -1

ప్రసిద్ధమైన ఉపనిషత్తులలో ఛాందోగ్యోపనిషత్తు ఒకటి. ఛందస్సులను గానము చేయువారు ఛందోగులు. ఛందోగులకు సంబంధించినది ఛాందోగ్యము. ఇది సామవేదమునకు సంబంధించినదని పలువురి నిర్ణయము.

''ఛాందోగ్యోపనిషచ్ఛ్రేష్ఠా బ్రాహ్మణనిస్సృతా'' అనువాక్యము వలన ఇది శ్రేష్ఠమైనదని, తాండ్య బ్రాహ్మణమునకు సంబంధించినదని స్పష్టమగుచున్నది. దీనిలో ఎనిమిది ప్రపాఠకములు గలవు. ప్రపాఠకములోని భాగములకు ఖండములని పేరు. మొత్తం 154 ఖండములున్నవి. గూఢములైన విద్యలను కొంతమంది శిష్యులు తమ గురువులద్వారా అభ్యసించినట్లు దీనిలో తెలుస్తోంది. ప్రస్తుత సమాజానికి అవసరమైన కొన్ని విషయములను ఈ వ్యాసములో వివరించుట జరుగుతోంది. ఇందు వైశ్వానర విద్యలోని పంచాహుతుల ప్రభావము చెప్పబడింది. విశ్వమే ఒక వైశ్వానరాత్మ. వైశ్వానరుడనగా సృష్టియందంతటను వ్యాపించియున్నవాడని భావము.

అన్నము భుజించునపుడు సర్వవ్యాప్తమైయున్న వైశ్వానరాత్మను సేవించువిధానమే ప్రాణాపాన వ్యానోదాన సమానరూప ఆహుతులను స్వీకరించుట.

మనకు భుజించుటకు లభించిన అన్నమును యజ్ఞాహుతిగా భావించవలెను. భోజనము చేయునపుడు నోటియందుంచు మొదటి ముద్దను ప్రథమాహుతిగా తలచి ''ప్రాణాయస్వాహా'' అనవలెను. దానిచేత దేహమందున్న పంచ ప్రాణములలోని ప్రాణవాయువు తృప్తి పొందును.

ప్రాణము తృప్తి పొందినచో ''కన్ను'' తృప్తిపొందును. కన్నులు తృప్తి పొందుటచే సూర్యుడు తృప్తుడగును. సూర్యుడు తృప్తుడైన దినము తృప్తి చెందును. సూర్యుడు, దినము తృప్తములైనచో వానిని ఆశ్రయించుకొని ఉన్నవన్ని తృప్తి చెందును. దీనిచే వైశ్వానరుడు అనగా అంతర్గత ప్రాణము తృప్తమగును. దీనిచే నరునకు సంతతి, పశువులు, భోగసంపత్తి, తేజస్సు, బ్రహ్మవర్చస్సు కలుగును.

రెండవ ముద్దను యజ్ఞాహుతిగావించి నోటి యందుంచుకొనుచు ''వ్యానాయస్వాహా'' అనవలెను. దానిచేత పంచప్రాణములలోని వ్యానవాయువు తృప్తి చెందును. వ్యానము తృప్తమైనచో శ్రోత్రము (చెవి) తృప్తినొందును. శ్రోత్ర తృప్తిచే బ్రహ్మాండమందలి చంద్రుడు తృప్తుడగును. దానిచే దిక్కులు తృప్తి పొందును. దీనివలన చంద్రునియందు, దిక్కులయందును గల పదార్థములన్నియు తృప్తినొందును. దీని వలన సంతతి, పశువులు, భోగములు కలుగును.

ఆ తరువాత మూడవ ఆహుతిని (ముద్దను) స్వీకరించుచు ''అపానాయస్వాహా'' అనవలెను. దానిచేత దేహమందలి అపాన దేవత తృప్తమగును. అపాన దేవత తృప్తిచెందిన వాక్కు తృప్తమై దీనిచే ''అగ్ని'' – అగ్ని తృప్తిచే భూమి తృప్తములగును. దానిచే అగ్నిని, భూమిని ఆశ్రయించి యున్నవన్నియు తృప్తములగును. వీటి తృప్తి వలన మానవుడు సంతత్యాదులను పొంది సుఖించుచు తృప్తుడగును.

నాల్గవ గ్రసమును (ముద్దను) నోటియందుంచునపుడు ''సమానాయస్వాహా'' అనవలెను. దానిచే సమాన ప్రాణము తృప్తమగును. సమాన ప్రాణము తృప్తి నొందిన - ''మనస్సు'', మనస్సు తృప్తి వలన మేఘము తృప్తి నొందును. మేఘము తృప్తమైన ''మెరుపు'' (విద్యుత్తు) తృప్తమగును. దీనిచేత మేఘమును, విద్యుత్తును, ఆశ్రయించియున్నవన్నియు తృప్తినొందును. దీనిచేతను సంతత్యాదులను అనుభవించుచు మానవుడు తృప్తుడగును.

ఐదవ గ్రసమును (ముద్ద) '' ఉదానాయస్వాహా'' అనుచు నోటియందుంచుకొనవలెను. దానివలన ఉదాన ప్రాణము తృప్తమగును. ఉదానము తృప్తమైన ''చర్మము'' దాని వలన వాయువు - దానివలన ఆకాశము తృప్తములగును. వాయువు, ఆకాశము తృప్తిచెందుటచేత వీటిని ఆశ్రయించుకొన్నవన్నియు తృప్తిచెందును. ఈవిధముగా నరునినుండి వైశ్వానరుని వరకు అన్నియు తృప్తి చెందగా ఉపాసకుడు సంతతి, పశువులు భోగసామాగ్రి, తేజస్సు, బ్రహ్మవర్చస్సు కలిగి తృప్తిని బొందును.

మానవుడు తాను భుజించు ఆహారము తనలోని పంచ ప్రాణాత్మకమైన ఆత్మకు అర్పణచేయుచున్నట్లు భావించవలెను. ఇది అంతయు ఆయనదే అను భావన కలుగవలెను. దీనివలన మానవునకు స్వార్థచింతన నశించి పరోపకారబుద్ధి, దానిచే మానసిక పరిశుద్ధత కలిగి సుఖజీవనము చేసి ఆత్మస్వరూపుడు కాగలడను భావం దీనిలో అంతర్గతమై భాసించుచున్నది.

సేకరణ:

ఉపద్రష్ట వేంకటకృష్ణయ్య, విజయవాడ.

---

## ప.పూ.శ్రీ డాక్టర్ జీ,- శ్రీరూయికర్

( ఒక రోజు డాక్టర్‌జీ, కార్మిక నాయకుడు శ్రీరూయికర్‌ల సంభాషణ)

శ్రీరూయికర్ : డాక్టర్జీ! మీరు, మీ సంఘం మతతత్త్వవాదులుగదా?

డాక్టర్జీ:- రూయికర్ మీకో ప్రశ్న. సరైన సమాధానం చెబుతారా?

రూయి:- నేనెప్పుడు అబద్ధంచెప్పాను?

డాక్టర్జీ:- ఈ రాత్రి రెండుగంటలకు మిమ్మెవరైనా నిద్రలేపి, రూయికర్‌జీ మళ్ళీ భారతదేశంలో శివాజి పాలన ప్రారంభమైంది అని చెప్పారనుకోండి, మీకేమనిపిస్తుంది?

రూయి:- అప్పుడు నా ఆనందానికి పట్టపగ్గాలుండవు. అందరికి మీ ఠాయిలు పంచిపెడతాను. పండుగ జరుపుతాను.

డాక్టర్జీ:- (నవ్వుతూ) అయితే, చివరికి మీకూ, మాకూతేడా ఏముంది? మేము ఆపండుగ జరుపుకొనే పరిస్థితిని నిర్మాణం చేస్తున్నాం. మేము ఈ విషయం స్పష్టంగా చెబుతాం. ఆస్థితి నిర్మాణం జేయగలమన్న ఆత్మవిశ్వాసం మాకుంది. మీ ఆశలన్నీ ముక్కలయాయి. మీకుమన సమాజంపైన విశ్వాసం పోయింది నాకు మన సమాజంపైన సంపూర్ణవిశ్వాసంవుంది. పనిచేసే సత్తా కూడా వుంది.

**( ఇలా జీవించండి నుండి)**

( ఏప్రిల్.8. ప.పూ.శ్రీ డాక్టర్జీ జయన్తి)

# అర్ధశతాబ్ది ప్రజాప్రభుత్వం

(డిశంబర్96. సంచికతరువాయి) -వి.వి. తిరుపతయ్య

ఇది 100 సంవత్సరముల కాంగ్రెస్ చరిత్రలో ఒక ఘట్టము మించిపోయిందేమీలేదు. ఇకనైనా నేతలు పశ్చాత్తాపపడి 'Z' Categary రక్షణను కవచముగా తీసికొని వీరవిహారము చేయరాదు. ప్రజానాయకులు కదా! ప్రజలలోనికి దూసికొని పోవాలి. వారిలో వీరు కూడ అన్నింట భాగస్వాములు కావాలె. స్వాతంత్ర్య పోరాటములో మరణించిన వారి సంఖ్యకన్నా స్వాతంత్ర్య సముపార్జనా వంతరము బలియైనవారి సంఖ్య ఎన్నోరెట్లు పెరిగింది. ప్రజల, ధన, మాన నష్టములు జరుగుతుంటే నాయకులకు చీమకుట్టినట్లుకూడ కావడములేదా. తమ ఆస్థులను కాపాడుటకు పోలీసు బలగమున్నది కదా! ఎందుకు పనికిరాని, వినాసయోగ్యముకాని, ఎవరు నివసించని శిధిలావస్థలో నున్న తమ భనములను, మేడల్లను కాపాడుటకు లక్షలు ఖర్చుచేసి Plice ల కాపలా పెట్టిన సంగతి జగద్వితమే. Ancestral property అంటె ఎంత Attachment, గౌరవము, పొగడవలసినదే! సామాన్యుల ఆస్థులు కూడ అట్టివేనని తెలిసిరావాలి, అప్పుడే వారు ప్రజానాయకులు లేనిచో నాయకమ్మన్యులు.

ఇప్పుడేర్పడిన ప్రభుత్వములో చేరికొందఱు Inside support, చేరక మఱి కొందఱు out - side - support చేస్తారట! ఈ supports ఎన్నాళ్లో నిలిచేవికావు. ఒండొరుల, వారి వారసుల Scams, దొంగతనాలు బయటపెట్టక శ్రీకృష్ణ జన్మ స్థానములనుండి తప్పించినన్నినాళ్లే. ఈ ప్రభువులు బీదవారిని ధనికులుగా చేయలేరు సరికదా! Taxes పెంచి, ధనికులను భికారీలుగా మాత్రము మార్చుచున్నారు. సర్వజన సమానత్త్వముగదా? వీరిధ్యేయము, క్రొత్తక్రొత్త Taxes వేసి గడ్డితినుమనుచున్నారు. ఆగడ్డి కూడ మిగుల కుండ వారే కఱచిమ్రింగి, తీరికగా నెమరువేయుచు ఇంకా దేనికి ఎసరుపెట్టాలో ఆలోచించున్నారు. అంతర్యము హస్తిమశకాంతరము.

U.F., L.F.ల కాంగ్రెస్, కాంగ్రేసేతర పార్టీల పొత్తు ఏనుగకు సింహానికి, పిల్లికి ఎలుకకు గోరు కొయ్యలకు మూలచుక్కకు, అత్తకోడలుకున్నంత స్నేహము వంటివి, ఐనా కలిసి పోయినారంటే ప్రశంసార్హమే. ప్రపంచమంతా వీరిని వేయి కన్నులతో పరీక్షించుచున్నది. ఈ పిరీక్షలో నెగ్గిబ్రతికి బయట పడగలరా? చూడాలి. సహజమైన వైరమెట్లు సమసిపోగలదు. వారిని పుట్టించిన బ్రహ్మయ్యకే తెలియాలి. తిమ్మని బ్రహ్మ, బ్రహ్మని తిమ్మని చేయుట వీరికి అసహజము లేమికావు. తిన్న ఇంటి వాసాలు లెక్కపెట్టేవారే వీరంతా. మసిపూసి మారేడుకాయచేసే బహువేషధారులైన బుడబుడక్కల వారి కెంత మాత్రము తీసిపోరు వీరు. ఎన్నికలైపోయిన తరువాత దాగుడు మూతలాడుతారే కాని ఎవరికి కనిపించరు, దొరుకరు.

నాయకులందరూ అట్టడుగున పడిపోయి కృంగికృశించే హరిజను గిరిజనుల అభ్యుదయమే కావలెనంటున్నారు. వారి అభ్యుదయమే తమ ధ్యేయమంటారు. అంటరానితనమును మంటగలుపవలెనని గొంతెత్తి కూయుచున్నారు. మంచిదే కాని అంటరాని తనమెక్కడున్నదో అంతుపట్టడములేదు. ఇది నాయకులు బీదవారి కొఱకు కార్చే మొసలికన్నీరు తప్ప మఱేమీకాదు.

ఇది వఱకటి Primeministers, నాయకమ్మ న్యులు కొందఱు ససేమిరా కిచిడీ ప్రభుత్వము వద్దని గొంతెత్తి గోలచేసినారు. ఇప్పుడే మో అదే కావలన్నారు. సంఖ్యాబలమును ఎవరుకాదంటారు,

కాదని బ్రతుకగలరా? Quantity కి Quality దాసోహమన్నది. దానిముందిది బలాదూరైనది. R.S.S, జన సంఘములను Communal అన్నారు. నిజానికి comunal కానివి ఈ రెండే రెండు. నేటి ప్రధాన మాత్యులొకనాడు వీరిని మచ్చలేని ఆర్గనైజేషన్ అని ప్రస్తుతించినారు. 13 రోజులలో వారికి కళంకమునాపాదించినారు. కుళ్లుతో, ఈర్ష్యాసుయలతో నిండిన ఈ కూటమి ఎన్నాళ్లు మనగలదో వేచిచూడవలసియున్నది. అందరు మంత్రిపదవులే, ముఖ్యముగా Important Potrdpolios and cobinet Ranks కావాలె. M.P.లందరు మంత్రులైనను ఆశ్చర్యములేదు. కాని ఇదివఱకే కోటానకోట్లు అప్పులపాలైన భరతమాత ఈ బరువును మోయగలదా? ఈ White Elephants ను భరించగలదా? అదంతా ఎవరికి కావాలి? ముదుసలి అవ్వ ఇంట్లో నుంటే యేమి? మంటిలో పోతేనేమి? తాము తమ వారసుల బాగుంటేచాలు! పాలుగుడిచి పాలిండ్లను గుద్దేవారే అందరు. కొందఱేమో Party లో ఉంటే లాభమా? ప్రభుత్వములో ఉంటేమేలా? మఱికొందరు State లో ఉంటే గిట్టుతుందా? Central గిట్టుబాటా? అని బ్యారేజి వేసి లెక్కలు కడుతున్నారు. ఎందుకైనా మంచిది రెండు కావాలనేవారు మఱికొందరు. అవ్వకావాలె, బువ్వకావాలెనంటే ఎలాగా అని ఆలోచించరు, తండ్రి Central కు వెళితే, కొడుకును Stateలో స్థిరపరుస్తారు. ప్రజాసేవా తత్పరులుకదా అంతమాత్రము Sacrifice చేయరా! Ex priministors తిరిగి ఆపదవికి నక్కలవలె నిరీక్షించుచు ఆశించుచున్నారు. మీటు బెట్టి ఓటు, బొరిది బూటు చూపేవారే. కాని దీనికి

(సశేషం)

---

## మనదేశ చరిత్రకు జరిగిన ద్రోహం

'-పోలిశెట్టి బ్రదర్స్'

ప్రస్తుతం చెలామణీ అవుతున్న మన దేశ చరిత్ర, మనం వ్రాసుకున్నది కాదు. దాన్ని పాశ్చాత్యులు వ్రాశారు. హైందవ ప్రాచీనతనూ, పరిజ్ఞానాన్నీ సహించలేని పాశ్చాత్యులు, మన ప్రాచీనతను వీలయినంత వరకూ కుదించి, ఆధునిక కాలానికి లాక్కొచ్చారు. మన ప్రాచీనులు కనుగొన్న ఎన్నో గొప్ప విషయాల ఘనతను, ఇతరేతర దేశాలకు కట్టబెట్టారు. భారతజాతికి చెందిన మహాపురుషులు, రాజులు, వీరులు, జాతీయ పురుషులు అయినవారిని గురించి వీలయినంతవరకూ తగ్గించి వ్రాశారు. వేదకాలాన్ని వీలయినంతవరకూ ఆధునికం చేసే ప్రయత్నాలు చేశారు. ఏ చారిత్రిక ఆధారం లేని "ఆర్యుల దండయాత్ర" అనే అబద్ధంతో మన చరిత్రకు నాంది పలికారు. తిథి, వార, నక్షత్రాలతో సహా ఖగోళపరమైన ఆధారాల్ని కలిగి ఉన్న మహాభారతాన్ని "చరిత్రలోకి" తీసుకోకుండా, పురాణాల్లోకి ( ఊహాగాథగా) గెంటేశారు. భారతజాతి అనుసరిస్తున్న యుధిష్ఠర, కలి, విక్రమార్క, శాలివాహన, విజయాభినందన, నాగార్జున, కల్కి శకాలను తప్పించేసి "క్రీస్తుపూర్వం, క్రీస్తు శకాలను" (క్రీ.పూ., క్రీ.శ. లను) మనకు అంటగట్టారు.

విదేశీయులు వ్రాసి పెట్టిన కల్లబొల్లి పాఠాల్నే "మన చరిత్రగా" నమ్మి, బట్టీ పట్టేస్తున్నాం, Ph.Dలు కూడా పొందేస్తున్నాం. ఈ పరిస్థితి మారాలి. మనం కళ్ళు తెరచి, మనకున్న ఆధారాలతో ఇప్పటికైనా మన యదార్థ చరిత్రను వ్రాసుకోవాలి.

(పురాణాల్లో సైన్సునుండి).



# ''కష్టేఫలి'' మధురశ్రీ పుల్లారెడ్డి

(జగమెరిగిన నేతిమిఠాయి వ్యాపారవేత్త మధురశ్రీ జి.పుల్లారెడ్డి గారితో 'విశ్వహిందు' - సం.)

సం: నమస్కారమండి రెడ్డిగారు. మీరు జగమెరిగిన.......

శ్రీ పు.రె: '' ఆ! ఆ!మరి..నా చేయిచూచి ఓహస్తసాముద్రికుడు నీకు కూడు లేదు'' అన్నాడు.

సం: మరిమీరు ఇప్పుడు ఎంతమందికి పని కల్పించారు?

పురె:200మందికి

సం: అంటే 200కుటుంబాలకు మీరు బ్రతుకు తెరువు చూపారు గదా.

పురె: అంతా ఆభగవంతుని దయ.

సం:- మీరు వ్యాపారం ఎలా ప్రారంభించారు? ఇంతగొప్పవారైన మీ విజయ రహస్యం?

పు.రె! ''కృషితో నాస్తిదుర్భిక్షం'' పని, పని, పని....మొదట సైకిల్‌పై తిరిగి 'టీ' అమ్ముకున్నాను. రోజుకు 12 గం॥కష్టపడి పనిచేశాను. పూర్వం టీవీలు, సినిమాలు వగైరా ఆకర్షణలు చాలతక్కువగదా. క్రమేణా శ్రద్ధగా, శుభ్రంగా, నేతిమిఠాయిలు తయారు చేశాను. భగవంతుని దయవల్ల అదృష్టం కలిసివచ్చి ప్రజలు ఆదరించి అభిమానించారు. దేశంలోనే కాక విదేశాల్లోనూ మా మిఠాయి రుచి చూస్తున్నారు.

సం: మీరు దానధర్మాలు బాగాచేస్తున్నారని తెలుస్తున్నది?...మరి....

పురి: మా ట్రస్ట్ ద్వారా భాగ్యనగర్‌లో జూనియర్ కాలేజి, డిగ్రీకాలేజి, ఫార్మసీ డిగ్రీకాలేజీలు, కర్నూలులో ఇంజనీరింగ్ కాలేజీ నడుపుతున్నాము. కర్నూలులో విజ్ఞానపీఠం- ఆర్షనేజి ( ఉచిత) ఉన్నత పాఠశాల, హైద్రాబాదులో నాల్గు ఉన్నత పాఠశాలలు నడుస్తున్నాయి.

విద్యార్థులకు మెరిట్ స్కాలర్‌షిప్పులిస్తాము. బీదవిద్యార్థులకు ఫీజులు కడతాము-మా స్వగ్రామం గోకవరంలో 10 పడకల ఉచిత ఆసుపత్రి నిర్వహణ, హైద్రాబాద్‌లో సంస్కృత భాషాప్రచార సమితి నిర్వహణ మొ॥కార్యక్రమాలు చేపట్టాము.

సం: విశ్వహిందూ పరిషత్ కార్యక్రమాల్లో మీ మార్గదర్శనం?

పు.రె: వి.హిం.ప. కార్యక్రమాలు నడుస్తున్నాయి. అయోధ్య, మధుర దేవాలయాల విముక్తి. 300 సంవత్సరములనాటి రికార్డు మనకనుకూలంగా ఉంది, అయినా భారతప్రభుత్వం సంవత్సరానికి 12కోట్లు ఖర్చులో, పోలీసుకాపలా పెట్టి హిందూవిశ్వాసాలను కించపరుస్తున్నది.

కార్యకర్తలు పరస్పర సహనం, సహకారాలతో కష్టపడిపని, పనిచేయాలి. పరిషత్‌కు ధనలోపం లేకుండా నావంతు కృషి నేను చేస్తున్నాను.

సం: పోతే మన యువతకు మీరిచ్చే సలహా ఏమైనా....?

పు.రె: పని, పని, పని నిరంతరం పనిచేయాలి. విలాసాలు, విహారాలు కాదు. పనిగావాలి. చిన్నదేశమైనా జపాను, జపాను యువకులు చూడండి. అలాగే చైనా. పదవ తరగతి తర్వాత నుండి విద్యార్థులు పనిచేస్తూ సంపాదించి చదువుకోవాలి. చదువువిజ్ఞానం కొరకు, వినోదం మితిమీరరాదు. తనతనువును, తన ఇల్లును ఎలాచూచుకుంటారో అలాగే దేశం కొరకు దేహాన్ని వినియోగించాల్సిన అవసరం, బాధ్యత యువతపైన ఉంది.

అలాగే సమాజంలో కులమతాలకు కుచ్ఛితాలకు దోహదపడకుండా ఎవరిమతాన్ని వారు అనుసరిస్తూ ధర్మాన్ని కాపాడితే అది మనలను కాపాడుతుంది. ద్వేషాలు, కలహాలు తగవు. మతమార్పిడులు తగవు. సమాజం సమైక్యంగా ఉంటే భారతజాతి ప్రగతి పథంలో నడుస్తుంది.

సం:-నిరంతరం పని, పని అంటూ కాలాన్ని సద్వినియోగం చేసే మీరు పత్రికకు సమయమిచ్చి మంచి విషయాలు చెప్పారు. ధన్యవాదములు ఉంటాను.

పు.రె: ఆ! ఆ! సరే మిఠాయి యిదిగో, తినూ.

జీవిత కథ

# శ్రీకాంత్ జిచ్‌కర్ - ఒక అద్భుతమైన వ్యక్తిత్వం.

**పది విషయాలలో M.A. పట్టా, జర్నలిజంలో డిగ్రీ, న్యాయశాస్త్రంలో LLM, వైద్యశాస్త్రంలో M.B.B.S., M.D., సంస్కృతంలో D.Lit ఇంకా I.P.S. దానికితోడు I.A.S., అంతేకాదు కంప్యూటర్ నిపుణుడు, జ్యోతిష విద్వాన్, అతనికి భగవద్గీత మొత్తం కంఠపాఠం-పైగా ఒక ఉపేక్షిత, బలహీనవర్గానికి చెందిన వారై ఉండికూడా నైష్ఠిక అగ్నిహోత్ర బ్రాహ్మణుని వలె శుద్ధవైదిక జీవనాన్ని అవలంబిస్తూ, శాసనసభ్యుడుగా, మహారాష్ట్ర మంత్రివర్గంలో ఒక మంత్రిగా, పార్లమెంటు సభ్యునిగా ఎన్నో రాజకీయ పదవులు సైతం అలంకరించి, మరెన్నో వైశిష్ట్యతలు పుణికి పుచ్చుకొన్న అద్భుతమైన వ్యక్తి-అతడే-నాగపూర్‌కు చెందిన శ్రీకాంత్ రామచంద్ర జిచ్‌కర్. ఇలాంటి ఊహించలేని అద్భుత వ్యక్తిత్వాన్ని సృష్టించిన ఆభగవంతుని మహిమకు జేజేలు పలుకుతూ ఇక చదవండి విజయపరంపరలతో కూడిన అతని జీవితకథను- *చదవండి.***

శ్రీకాంత్ జిచ్‌కర్‌ను గురించి ఏమిచెప్పినా ఉన్నపలాన ఎవరూ దాన్ని విశ్వసించలేరు. విద్యారంగంలో అతి చిన్న వయస్సులో ఉన్నత ప్రమాణాలు సాధించిన వారున్నారు. విజ్ఞానం, సాహిత్యం, కళలు లేదా జర్నలిజం రంగాలలోనూ కీర్తిశిఖరాలు అందుకొన్నవారున్నారు. చిన్నవయస్సులోనే శాసనసభ్యులుగా, పార్లమెంటు సభ్యులుగా రాష్ట్రంలో లేదా కేంద్రంలో మంత్రులుగా పదువులు అలంకరించిన వారూ ఉన్నారు. అయితే అతి తక్కువ వయస్సులో ఏయువకుడూ ఒకేసారి ఇన్ని వివిధరంగాలలో, పరస్పరం సంబంధంలేని రకరకాల విద్యలలో నిష్ణాతుడవటమేకాదు భారతీయ పోలీసువ్యవస్థలోనూ, పరిపాలనావ్యవస్థలోనూ ఉన్నత బాధ్యతలు స్వీకరించి కొంతకాలం నిర్వహించి ఆ తరువాత వాటిని వదలి రాజకీయంలో ప్రవేశించి ఆరంగంలోనూ అత్యున్నత స్థానాలకు ఎదిగి పోవడం బహుశ ఎవరూ కనీవినీ ఎరిగి ఉండరు. శ్రీకాంత్ జిచ్‌కర్ ఇలాంటి వాడే. అతడు సంపాదించిన పట్టాలు, పదవులు సాధించిన పనులను ఒక్కొక్కదాన్ని గురించి రెండేసి పంక్తులు వ్రాసినా రెండు మూడు పేజీలు అవలీలగా నిండిపోతాయి. ఆయన పూర్తిపేరు డాక్టర్ శ్రీకాంత్ రామచంద్ర జిచ్‌కర్, M.B.B.S. తర్వాత M.D. పూర్తిచేశారు. ఆ తర్వాత D.D.M. డిగ్రీకూడా సంపాదించారు. వ్యాపార నిర్వహణకుసంబంధించిన M.B.A. పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. సంస్కృతంలో D.Lit, మరియు జర్నలిజంలో B.J. చేశారు. అంతర్జాతీయ న్యాయవిభాగంలో L.L.M. పూర్తిచేశారు. అంతేనా? సంస్కృతం, అర్థశాస్త్రం, ఆంగ్లం, చరిత్ర, దర్శనశాస్త్రం, సంస్కృతి మరియు పురాతత్వశాస్త్రం వంటి పదివిషయాలలో M.A. పట్టాపుచ్చుకున్నారు. అదీ మామూలు ఉత్తీర్ణతకాదు సుమా ప్రతి విషయములోనూ ప్రథమ స్థానాన్నే పొందారు. నాగపూర్ విశ్వవిద్యాలయంలో ఎన్నో బంగారు పతకాలు గెలుచుకున్నారు. విశ్వవిద్యాలయ విద్యార్థి సంఘానికి అధ్యక్షులుగానూ పనిచేశారు. 1978లో IPS పూర్తిచేసి భారతీయ పోలీసు సేవావిభాగంలో ఉన్నత అధికారిగా చేశారు. ఆరోజుల్లో జరిగిన శ్రీమతి ఇందిరాగాంధీ అరెస్టుకు నిరసనగా IPSకు రాజీనామా చేశారు. వెంటనే IAS పరీక్షవ్రాసి అదీ నెగ్గి 1980లో IAS అధికారి అయ్యారు. 1983లో ప్రపంచంలోని పదిమంది అత్యంత ప్రముఖ యువకుల జాబితాలోకి ఎక్కి ఘనంగా సన్మానించబడ్డారు. దేశంలోని అత్యంత బుద్ధికుశలురు, యోగ్యులు, నిపుణులు అయిన వ్యక్తిగా 'లిమ్కా బుక్ ఆఫ్ రికార్డ్స్'లో వారిపేరు నమోదు కాబడింది. అందరిలోనూ తక్కువ వయస్సుగల శాసనసభ్యుడుగా మహారాష్ట్ర శాసనసభకు ఎన్నికయ్యారు. మహారాష్ట్ర ప్రభుత్వంలో మంత్రిగానూ నియమించబడ్డారు. 1992లో రాజ్యసభకు ఎన్నికైనారు. ప్రపంచంలోని అనేక ప్రముఖ

దేశాలలో పర్యటించారు. చిత్రకళలో ప్రావీణ్యత సంపాదించారు. అంతేకాదు ఫొటోగ్రఫీ, పైంటింగ్‌లలో నైపుణ్యం సాధించారు. ఔత్సాహిక హోమ్‌రేడియో ఆపరేటర్‌గానూ, కంప్యూటర్ ప్రోగ్రామర్‌గానూ గంటలు గంటలు గడపడం ఆయన అభిరుచి. ఇంట్లో తనకోసం పెట్టుకున్న గ్రంథాలయంలో విభిన్నవిషయాలకు చెందిన 42,000 పుస్తకాలున్నాయి. అర్థశాస్త్రము, ప్రజాధనం వంటి విషయాలపై మూడు పుస్తకాలు కూడా వారు రచించారు. తీర్థయాత్రలు చేయడమంటే ఆయనకు మహాసరదా. అంతకన్నా ధార్మిక ప్రవచనాలు చేయడంలో ఆయనకెంతో ఆనందం, సమయం చిక్కినప్పుడల్లా రామాయణం, భగవద్గీత, వేదాలపై బహిరంగ ఉపన్యాసాలు ఇస్తూవుంటారు. ప్రతి సంవత్సరం నాగపూర్‌లో బడ్జెటు సమర్పించబడిన తర్వాత జరిగే ఆయన సార్వజనిక ప్రసంగం ఈ రోజు అందరికీ యిష్టమైన ఓ రివాజుగా మారిపోయింది.

అయితే ఏంచేశారు వారు?

అప్పుడే అలసిపోయారా? అసలుకథ ఇంకా ప్రారంభంకావలసి ఉంది. ఔనండీ, ఒకేవ్యక్తి ఇన్ని విద్యలూ ఆర్జించడం, ఇన్ని పదవులు సంపాదించడం బాగానే ఉంది. అది గొప్పతనమైతేకావచ్చు. సందేహంలేదు. అయితే ఇవన్నీ అతడు సమాజానికెలా ఉపయోగిస్తున్నాడు. వాటివల్ల సమాజానికి కేమైనా ప్రయోజనముందా? అతని జీవితం వల్ల సమాజం ఏదైనా ప్రేరణ పొందిందా? అని మీరు అడగవచ్చు. మొదట మాకూ అదే అనిపించింది. కాని అతని వ్యక్తిత్వపు పొరలు ఒకటొకటి బయట పడుతూ ఉంటే మాకే ఆశ్చర్యం వేసింది. ఏమైనా సరే ఒకసారి వెళ్లిచూద్దాం అనుకున్నాం.

శ్రీకాంత్ జిచ్‌కర్‌గారిది ముఖ్యంగా వ్యవసాయకుటుంబం. అవసరాలకు తగినంత ధనానికి వారికేమీ ఇబ్బందిలేదు. కులాన్ని బట్టి పరిశీలిస్తే మహారాష్ట్రలోని ఒక బలహీనవర్గానికి చెందిన కుటుంబంకావాలి. అయితే బాల్యంనుండీ జిచ్‌కర్ భగవద్గీత పట్ల ఎంతో శ్రద్ధకలిగి ఉండేవాడు. చిన్నప్పుడే గీతాశ్లోకాలన్నీ కంఠపాఠం చేసుకొన్నాడు. గీత తర్వాత వేదాలను కూడా చక్కగా అధ్యయనం చేసిన తదుపరి తాను ఒక నిష్ఠావంతుడైన వేదానిష్ఠహిందువుగా జీవించాలని సంకల్పించుకొన్నాడు. అగ్నిహోత్ర బ్రాహ్మణునిలా తనను తాను మలచుకొన్నాడు. తన ఇంట్లో నిరంతరం జ్వలించే అగ్నిశాలను సిద్ధం చేసుకొన్నాడు. అందుకు సంబంధించిన అనుష్ఠానం అఖండంగా, నిరంతరాయంగా జరిగేలా ఏర్పాటు గావించాడు. ఇది ఎంతో కఠోరమైన వ్రతం మరి. అంతిమ సంస్కారం సమయంలో ఈ అగ్నిశాల అగ్నితోనే చితికి నిప్పుపెట్టబడుతుంది. మరే నిప్పుపనికిరాదు. అగ్నిహోత్రం ఎప్పుడూ ఆరిపోరాదు. నియమానుసారం పూజ జరగాలి. అందుకు కావలసిన కట్టెలు, ఇతర పదార్థాలు విధిప్రకారం సేకరించబడాలి. ఎప్పుడూ లభ్యంకావాలి. మరో ముఖ్యమైన విషయం ఏమంటే దేశ విదేశ ప్రయాణాలలోనూ ఎల్లప్పుడూ ఆ అగ్ని సాధకుని వెంటే ఉండితీరాలి. శ్రీకాంత్ జిచ్‌కర్ ఈ అన్ని నియమాలనూ ఎంతో నిష్ఠతో పాటిస్తూవుంటారు. ఈ కారణంగానే తన వివాహానికి ముందు రెండు సంవత్సరాలు తనకు తగిన వధువు కోసం స్వయంగా అన్వేషణలో గడిపారు.

తన భావాలను, ఆశయాలను అర్థంచేసుకొని కేవలం గౌరవించడమే కాదు వాటి సాధనలో తనకు శ్రద్ధా భక్తులతో క్రియాత్మకంగా సహకరించగల సహధర్మచారిణి కోసం తానే స్వయంగా వెతికానన్నారు శ్రీ జిచ్‌కర్ స్వయంగా జ్యోతిష పండితుడు కూడా కావడంతో వందలాది జన్మపత్రికలు పరిశీలించిన అనంతరం 'రాజశ్రీ' అన్న అమ్మాయిని ప్రత్యక్షంగా చూడకుండానే తన పరిశీలన ప్రకారం ఈ అమ్మాయేనాకు తగిన వధువు అన్నాడు. అలా వారి వివాహం 1989 సం॥మే28వ తేదీన జరిగింది. ఆక్షణం నుండి ఆయింట్లోజరిగే సమస్త వైదిక విధుల నిర్వహణ భారం శ్రీమతి రాజశ్రీయే వహిస్తున్నది.

(సశేషం)

'మంజీరా'

# 'రామ్‌కే నామ్' డి.డి.బద్‌నామ్

ఈ మధ్య దూరదర్శన్‌లో ''రామ్‌కేనామ్'' అనే పేరుతో ఒకతుంటరి విషయప్రచార చిత్రం చూపబడింది. రామజన్మభూమి ఆందోళన పై విషంగక్కడం, హిందూ విశ్వాసాలను, ధర్మాచార్యులను కించపరచడం, హిందూసమాజాన్ని ముక్కచెక్కలుగా చూపడం, కమ్యూనిష్టు వాదాలకు భజన చేయడం. ఇత్యాదులు దీని కొన్ని లక్షణాలు. సామాన్యులకు మస్కాకొట్టడం దాని ప్రత్యేతల్లో ఒకటి. (వాని అవలక్షణాలన్ని ఇక్కడ కుదించడం కుదరదు.)

సామాన్యులకు మస్కాకొట్టడానికి సంబంధించి మీడియారంగంలో కొన్ని కొత్త చిట్కాలు ఆరంభమయినాయి. ఏమి దుష్ప్రచారం చేయాలో ముందే నిర్ణయించుకొని, ఒకమైకు పుచ్చుకుని (లేదా కలంపుచ్చుకుని) వీధుల్లో తిరగడం, ఎవరెవరినో ఏదో పలకరించడం, వారనేమాటల్లో తమకు పనికివచ్చే వాటిని లేదా తమకు పనికి వచ్చేలా చెప్పింపజేసి అదంతా ''ప్రజాభిప్రాయ''మన్నట్లు ప్రచురించడం (లేదా చూపించడం) ఒక చిట్కా.

ఈ చిట్కా ప్రయోగించింది. ఈ ''రామ్ కానామ్'' చిత్రం. రామ జన్మ భూమి ఉద్యమ ఊరేగింపులో ఒకవాలంటీర్‌ను పట్టుకుంది ఈ చిట్కామైకు. ''రాముడు ఎప్పుడు పుట్టాడు?'' అని అడిగింది. రాముడు పుట్టింది చైత్రశు॥నవమి అనేవరకు అందరికి తెలుసు. ఆపైన సామాన్యుల కెందరికి తెలుస్తుంది?

చిట్కామైకు ఈ సారి అదేప్రశ్నతో పెజావరు స్వామిని పట్టుకుంది. ఆయన చెప్పింది ఈ మైకుకు ఎలా అర్థమవుతుంది? ఆయన ఏదో ''యుగం వేల సంవత్సరాలు'' అంటే ఎప్పుడు పుట్టినట్లు అర్థం చేసుకోగలదీమైకు? అందువల్ల ఏదో గజిబిజి ప్రసారం. ''అంటే రాముడు ఎప్పుడు పుట్టాడో కూడా తెలియని వారు ఈ రామజన్మభూమి ఉద్యమ కారులు, వారి ధర్మాచార్య''లని ప్రేక్షకులకు చెప్పాలనీ, మనమంతా హిహిహి అనాలని ఈ చిత్రం కోరిక.

శ్రీరాముడు పుట్టింది త్రేతాయుగంలో. ప్రభవాది ఫలానా సంవత్సరం. ఉత్తరాయణం. వసంతఋతువు. చైత్రశుద్ధం. నవమితిథి. పునర్వసు నక్షత్రం. ఇదంతా (భారతీయమైన) చదువు, సంధ్య, తలకాయ లేని ఆమైకుకు ఎలా అర్థమవుతుంది? క్రీ.శ.క్రీ.పూ.ఫలాని నంబరు సంవత్సరం ఫలాని ఏప్రిల్ వగైరా నెల అని చెప్పాలి. ఈ తేదీలను ఎక్కడ నుండి పట్టుకొద్దాం? అప్పుడవి ఉంటే గదా! అందువల్ల ఏదో లక్షల సంవత్సరాలక్రితం అనకతప్పదు. అంటే '' ఎప్పుడు పుట్టాడోకూడా తెలియని వ్యక్తి కోసం ఇంత ఆందోళనా?'' అన్నట్లు నసుగుతుందా మైకు!

ఈ మాదిరి కొక్కిరాయి వ్యవహారాలను ఇలాంటిమైకులు హిందువుల విషయంలో యథేచ్ఛగా చేస్తాయి. అదే ఏ ముస్లిం విషయంలోనో క్రైస్తవుల విషయంలోనో చేయవు. కురాన్‌ఎవరు వ్రాశారు? ఎప్పుడు వ్రాశారు? అల్లా ఎలా ఉంటాడు? ఎలా ఉంటాడో తెలియకుండా ఎలా నమ్ముతున్నారు? ఇత్యాదిప్రశ్నలను ఏ ముస్లింనో అడిగి 'హిహిహి' అని పళ్లు ఇకిలించమనండి. లేదా క్రీస్తు ఎవరు? ఆయన తల్లి దండ్రులపేర్లేమిటి? ఇత్యాది ప్రశ్నలడిగి హిహిహి అనమనకండి. పళ్లుకాదు సరికదా అవయవాలతో ఆమైకు ఇంటికి చేరడమే ప్రశ్నార్థకమవుతుంది. ఆ విషయాన్ని ఈ మైకు కాదన గలదా?

ఇలాంటి మైకు సినిమాను రామాయణ, భారత భాగవతాలను ప్రదర్శించే ఆ దూరదర్శన్ ఎలా ప్రదర్శించింది? లేదా దానికి షేమ్? అని అడిగి లాభంలేదు. అది ఒక నౌకరు కదా! దానిని నడిపించేవారిని గురించి ఆలోచించాలి గాని. వారిని గద్దెపై కూర్చోపెట్టి–దీనినడిగి ఏమిలాభం?

ఉన్న పరిస్థితి అది. అసలు దౌర్బల్యం మనవాళ్లకు కొందరికి (భారతీయమైన) చదువు, సంధ్యలు, స్వాభిమానము లేకపోగా కాస్తగిరకూడా ఉండడం. ఆమధ్య ఒక ప్రబుద్ధుడు - '' ఈసైంటిఫిక్ యుగంలో ఇంకా కృతయుగం, త్రేతా యుగం, ప్రభవ, విభవ, చైత్రం వైశాఖ చాదస్తాలు?'' అని బడబడలాడాడు. అతడు సైంటిస్టేమీకాదు. తాను సైంటిఫిక్, హిందువులు కాదు అనే భ్రమమాత్రం ఉంది. అతడి బడబడకాగానే అక్కడే వున్న ఒక పాత కాలపు పంతులు ఇలా అన్నారు:

''బాబు తమరేదోఅన్నీచదువుకున్న వారల్లేవున్నారు. ఈ జనవరి ఫిబ్రవరి వగైరాలు ఎలా ఎప్పుడొచ్చాయో కాస్త సెలవిస్తారా? అలాగే అదేనోటితో ఈ చైత్రం వైశాఖలు ఎలా వచ్చాయో కూడా సెలవిస్తారా?'' అన్నాడా పాతకాలపు పెద్దాయన.

''మనవాడు'' ఖంగుతిన్నాడు. పాపం వాడికేమీ తెలియదామె. పెద్దాయన వాణ్ణి వదలలేదు. ''పోనీ నాకుతెల్సింది చెప్తాను. తప్పుంటే సరిచేయండి'' అని మొదలెట్టాడు. ఆయన చెప్పిన దాని సారాంశం ఇలా ఉంది:

''జనవరి అనే పేరు వారి తాలూకు జేనస్ అనే దేవత పేరు నుండి వచ్చిందట. ఆ తర్వాత పెళ్లిళ కార్తె ఉంటే, ఆడవారిని కాపాడే ఫిబ్రు అనే మరోదేవత పేరు పెట్టుకున్నారట. ఆతర్వాత మార్చి వగైరాలకు సంబంధించిస్పష్టత లేదుగాని అవి దేవతల పేర్లు అని చెప్పలేదు. జులై మాత్రం జూలియస్ సీజరు అనే వీరుని పేరుమీద, అగస్టస్ అనే పేరు మీద అగస్టుపెట్టుకున్నారట. ఇక ఆ తర్వాత నెలలకు సంఖ్యల పేర్లు పెట్టుకున్నారట. సెప్టెంబరు అక్టోబరు, నవంబరు, డిశంబరు ఇత్యాది నెలలపేర్లు సప్తమ, అష్టమి, నవమి, దశమి అనే సంఖ్యలను బట్టి వచ్చాయట. పోనీ అయినా , ఆసంఖ్యకు ఆ నెలవరుస సంఖ్యకు సంబంధంలేదు. తొమ్మిదో నెలపేరు సెప్టెంబరు (సప్తమ) పదోనెల పేరు అక్టోబరు (అష్టమ) పన్నెండో నెలపేరు డిశంబరు (దశమి). కొన్ని దేవతల పేర్లు, కొన్ని వీరులపేర్లు, కొన్ని ఏమిటో స్పష్టంగా తెలియనివి, కొన్ని పొంతనలేని సంఖ్యలపేర్లు. ఇదంతా ఎలా సైంటిఫిక్, ఎలా క్రమబద్ధమో, ఎలా తార్కికమో ఆ పెద్దాయనకు అర్థంకాలేదు.

ఇక చైత్రం, వైశాఖం వగైరాల సంగతి కూడా పెద్దాయన తాను విన్నదిచెప్పాడు. ప్రతినెల పూర్ణిమనాడు చంద్రునికి సమీపంలో ఉండే నక్షత్రం పేరు ఆనెలకు పెట్టారు. ఇదీ సూత్రం. ఆప్రకారం చిత్తనక్షత్రం పూర్ణిమనాడు చంద్రునికి సమీపంలో ఉంటే చైత్రమాసం. విశాఖనక్షత్రం. ఉంటే వైశాఖ మాసం, జ్యేష్ఠనక్షత్రం ఉంటే జ్యేష్ఠమాసం. చివరకు ఫాల్గునం వరకు ఇదే క్రమం. స్పష్టంగా కంటికి కనిపించే గ్రహనక్షత్రాలు ఆధారంగా ఒక నిలకడైన పద్ధతిలో మాసగణనం జరిగితే మరి అది ఎలాసైంటిఫిక్ కాదో ఆ పెద్దాయనకు అర్థం కాలేదు.

పెద్దాయనమరో కుమ్మరం కూడా తెచ్చాడు. ప్రభవ, విభవాది సంవత్సరాల పేర్లు గూడా సైంటిఫికే అన్నాడు. సూర్యుడు చలనం లేని స్థిరగ్రహం కాదని గమనం ఉందని మెల్ల మెల్లగా వలయాకారంలో జరిగి, స్వస్థానానికి చేరేసరికి (మనలెక్కలో) **60** సంవత్సరాలవుతుందనీ, ఆ అరవై సంవత్సరాలకు ప్రభవవిభావాది పేర్లు పెట్టారనీ, ఈ మాదిరి శాస్త్రీయత లేని వాళ్లు నంబర్లు పెట్టుకున్నారనీ చెప్పాడు. **1997, 1998** ఇలా. ఈ నంబర్లు ఎక్కడో మొదలు పెట్టాలిగా! క్రీస్తు మొదలు పెట్టారు. ప్రపంచం క్రీస్తుతో మొదలు కాలేదుగా! అంతకముందుకాలాన్ని ఏంచేయాలి? అందుకని క్రీస్తుపూర్వం అని మళ్లీ వానికి నంబర్లిచ్చారు. మరి మధ్యలో క్రీస్తు ఉండగా-అనగా క్రీస్తు జనన, మరణాలకు మధ్యకాలం- ఏనంబర్లిచ్చారో తెలియదు.

అనంత కాలానికి నంబర్లివ్వడం ఎలా? ఎంతపొడుగునంబర్లుకావాలి? అందు చేత ప్రళలసమయాలు గుర్తుగా యుగాలని పేర్లు పెట్టారు.

కృతయుగం **17,28,000** సం॥లు, త్రేతాయుగం **12,96,000** సం॥లు

ద్వాపరయుగం 8,64,000 సం॥లు, కలియుగం 4,32,000 సం॥లు

ఇలా గణించారు. ఇవీ బారుబారు సంఖ్యలే. వీనిని మళ్లీ పాదాలుగా విభజించి.. కలియుగే ప్రథమపాదే..అని దీర్ఘాలు తీస్తూ నిత్యమూ సంకల్పం చెప్పకుంటారు శిష్టాచారులు.

పైగా యుగాలుకూడా అనంతమే. కాలం అనంతం కదా. యుగాలు మళ్లీమళ్లీ వస్తుంటాయి కదా. అందువల్ల మళ్లీ మన్వంతరాలు అని పెట్టుకున్నారు. ''అద్యబ్రహ్మణః ద్వితీయ పరార్ధేశ్వేతవరహ కల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే ప్రథమపాదే...అని సాడిగించుకుని నిత్యమూ కాలాన్ని (దేశాన్ని కూడా) గుర్తు చేసుకుంటారు. అలాగుర్తుచేసుకునే నిష్ఠవల్లనే మన పెద్దవాళ్లు కాలాన్ని అంతఖచ్చితంగా గుర్తుచెప్పగల్గుతారు..

పెద్దాయన చెప్పక పోతుంటే మనవాడు-సైంటిస్టు-జావయిపోయినాడు. పారిపోదామన్నా సాధ్యం కానిస్థితిలో పడ్డాడు.

ఏదో వినోదానికి ఉదంతం చెప్పినా విషయం గాంభీరం. ఇలా హిందువుల గణనాన్ని హేళన చేసినవారున్నారు. ఈ ఉదంతం నేటి మనవారి పరిస్థితిపై వ్యాఖ్యా. నిజానికి కాలగణనం చాలా గొప్పవిషయం. కాలం అనంతం గనుక. అందుచేత ఒక తలకాయలేని మైకు హేళనగా-రాముడెప్పుడు పుట్టాడని ఎవరినో నిగ్గతీయడం ఏమి తెలివి? త్రేతాయుగంలో ఎప్పుడో పుట్టాడని చెప్పాలి. ఏకాలమానంలో చెపితే ఆ మైకుకు అర్థమవుతుంది? స్వర్ణయుగపు గుప్తుల బంగారు నాణేలను నేటి నయాపైసల్లో ఖచ్చితంగా చెప్పడం ఎలాసాధ్యం. ఈ కాలగణనమూ అంతే. స్థూలంగా లక్షల సంవత్సరాలు అనాలి. యుగాల సంఖ్యలు, గడచిన పాదాల సంఖ్యలు, యుగాల మధ్య ప్రళయాల కాలం ఇవన్నీ కలుపుకుని లెక్కలు తీస్తే ఏమైనా తెలుస్తుందేమో. ఆయా గ్రంథాల్లో ఏఏగ్రహాలు ఏస్థితిలో ఉండగా రామ, కృష్ణాదులు అవతరించారో - ఆ భాష తెలిసిన వారి పాదాల చెంతకుదురుగా కూర్చొని వినయంగా అడిగితే అంతో ఇంతో తేట తెల్ల మవుతుందేమో! కావాలంటే థిసీస్‌లు కూడా చేసుకుంటే చేసుకోవచ్చు. ఈమైకుకు కావల్సింది ఆ విజ్ఞానం కాదు- ఏదో అల్లరి, మస్కా ఇత్యాది.

మన కొచ్చిన పెద్దచిక్కు, మన దగ్గర ఇంత విజ్ఞానం ఉన్నా అది చదివే భాషలేదు. నేర్పేబడి లేదు. నేర్పడం బాధ్యత అని భావించే స్వంతప్రభుత్వం లేదు. వీటన్నిటిని మించి జనంలో పలుకు లేదు. (క్షమించాలి) ఆత్మవిశ్వాసం, స్వాభిమానం (జాతిపరంగా) లేవు. ఝూడించి మాట్లాడడం, జవాబివ్వడం, నిగ్గతీయడం లేదు. దానితో కొక్కిరాయిలు, కొండముచ్చులు ఇలాగే నెత్తికెక్కి కూర్చుంటాయి. రేడియోల్లోను, టి.వి.లలోను కూడా దూరుతుంటాయి. (ఈమధ్య కొంత మార్పు వస్తున్నదనుకొండి)

యువకులు (పెద్దలుకూడా) ఇంకా కాస్త లేవాలి. ఉషారుగా నోరువిప్పాలి. కలము, గళము ఎత్తాలి. తప్పుజరిగితే పత్రికల్లోను అక్కడా ఇక్కడా ఝూడిస్తుండాలి. ఎవరో అన్నారు. "Angry Hindu" అని అన్యాయాల పట్ల Anger(కుపితం కావడం) లో తప్పేమీకాదు గాని అంత అవసరం లేదు. గట్టిగా విజృంభించి, కాస్త assertion గా enlightenedగా ఉంటే తుంటరి శక్తులు తమనుతామే సర్దుకుంటాయి. రేడియోలు, టి.వి.లు కూడా సవ్యంగానే ఉంటాయి.

ఉగాది వస్తోంది. మంచి సమయం విజృంభణకు పంచాంగ శ్రవణంతో మొదలు పెడ్దాం. కాలగణనంలో హిందువుల విజ్ఞానమేమిటో, అసలు పంచాంగం అనేది ఏమిటో ఆపురాణం పంతులుగార్ని అడుగుదాం. విజృంభణకు చేతిలో మంచి విజ్ఞానంకూడా ఉంచుకోవాలి కదా!

- ధర్మప్రియ

# పిచ్చమ్మ అవధూత (1870-1951)

- ఆచార్య బి రామరాజు

పూర్వ పూర్వ జన్మల వాసనలు తరువాతి జన్మల్లో వెన్నంటి వస్తాయంటారు. తరువాతి జన్మల్లో ప్రదర్శితమయ్యే దైవీగుణాలు గానీ ఆసురీగుణాలు కాని పూర్వజన్మలనుండి సంక్రమించినవే. బాల్యంలోనే మహాకవులుగా మేధావులుగా కళాకారులుగా భక్తులుగా యోగులుగా కొందరు ప్రసిద్ధులౌతారు. పూర్వజన్మలో కొన్ని యోగభూమికలు అధిరోహించినవారు మరుజన్మలో సాధన చేసి మిగతా భూమిక లధిరోహించి ద్వంద్వరహితమైన శాశ్వతానందం అనుభవించి జీవన్ముక్తులౌతారు. అట్టివారిలో మాల పిచ్చమ్మ ఒకరు. షణ్ముఖీముద్రాభ్యాసకాలంలో వినిపించే దశవిధనాదాల్లో ఐదవదైన వీణానాంద శ్రవణకాలంలో పూర్వజన్మ చాలించటంచేత ఆ వీణానాదశ్రవణంతోనే యోగపూర్తికోసం ఉత్తర జన్మమెత్తిన యోగిని మాల పిచ్చమ్మ. కృష్ణాజిల్లా గుడివాడ తాలుకా బందరు హైదరాబాదు దండుబాటలో కురుమద్దాలి అనే గ్రామం ఉన్నది. అక్కడ 19వ శతాబ్దంలో వట్టి ముత్తయ్య వీరమ్మ అనే ఉత్తమ సంస్కారంగల కష్టజీవులు మాల దంపతులుండేవారు. వాళ్ళు నిరుపేదలైనా ధర్మసంపదలో దొడ్డవారు. వారికి ముగ్గురు కొడుకులు ఇద్దరు బిడ్డలు. అందులో చిన్నబిడ్డ పిచ్చమ్మ క్రీ.శ. 1870లో పుట్టింది. ముత్తయ్య ఇంటికి ఈశాన్యాన రామమందిరమున్ననది. గుడిలోని రామునికీ పిచ్చమ్మలోని జీవునికీ జన్మజన్మాల అనుబంధం. పరబ్రహ్మ సాక్షాత్కారానికి కులమతాల ప్రమేయం లేదు. కారణజన్ములకు జ్ఞానవైరాగ్యాలు కులాన్ని బట్టి రావు. స్త్రీ పురుష వర్ణ వర్గమతాలకు అతీతులైనవారే అవధూతలు.

పిచ్చమ్మ సుందరరూపం అగ్రవర్ణాల్లోను అరుదు. ఆమె ఆజానుబాహువు కాని ఆమె బాల్యచేష్టలు విచిత్రంగా ఉండేవి. తోటి పిల్లలతో ఆడుతూ ఆడుతూ మంత్రముగ్ధవలె పడిపోయేది. పాడుతూ పాడుతూ పరవశించి గొంతు మూగ పోయేది. తనలోపలినుండి వినిపించే నాదాలకు, కనిపించే ఇంద్రధనుస్సు వంటి చిత్కళలకు పిచ్చమ్మ తాదాత్మ్యం చెంది. ఆనాదాలకు ఆ రంగులకు అర్థమేమిటో తెలుసుకోవలెనని తల్లిదండ్రుల నడిగేది. కాయకష్టం చేసి బ్రతికే ఆ నిరక్షరకుక్షులకేం తెలుసు? చిట్టి తల్లి కేదో రోగం అనుకున్నారు. తదితరులు దయ్యమో భూతమో సోకిందన్నారు. రామాలయంలో శ్రీరామచంద్రుని చూస్తూ మైమరచినపుడు పిచ్చమ్మకు తనలోనుండి తనవంటి ఒక రూపం బయటకు వచ్చి గజ్జెల గలగలలతో తిరుగుతూ తనతో మాట్లాడే భాష తెలియక తల్లి నడిగితే బిడ్డకు రోగం ముదిరిందని తీరుతీరు వైద్యాలు చేయించినారు. బ్రహ్మానుభవంగల యోగులకు భవరోగవైద్యునికి తెలిసే విషయం వట్టి భిషక్కులకేం తెలుసు? తల్లిదండ్రులు చాలాకాలం వృధాగా డబ్బు వ్యయం చేసి విసిగి మందులు మాన్పించినారు. పిచ్చమ్మ ఎక్కువ సేపు ఏకాంతంగా ఉండేది. పిలిచినపుడు వచ్చి అన్నం తిని పోయేది. పెండ్లీడు వచ్చేవరకు పిచ్చమ్మ ఆకారమూ అందమూ నిండు చందురుని తలపించినవి కాని చేష్టలు నిరాశాజనకంగా ఉండేవి. ఇరుగు పొరుగు లామెను పిచ్చి పిచ్చమ్మ అనేవారు. పెండ్లి చేస్తే పిచ్చి కుదురుతుందని పదుగురంటే తుమ్మలపల్లి గ్రామంలో నీలం శోభనాద్రి అనే యువకునికిచ్చి మూడుముళ్ళు వేయించినారు. శోభనాద్రి నలుపైనా మంచి అందగాడు. ఆజానుబాహువు, రూపుకు తగిన గుణాలున్నవాడు. పిచ్చమ్మ అత్తవారింటికి పోయినా ఏకాంతమే. పుట్టింటిలో ఏకాంతానికి రామాలయం, మెట్టినింటిలో ఏకాంతానికి గొడ్లచావడి. తోటికోడలు ఇంటిపని చేస్తే పిచ్చమ్మ గోసేవ చేసేది, పేడ తీసేది, పిడకలు చేసేది. పశువులను మేతకు తోలుకపోయి నిర్జనప్రదేశంలో ధ్యానముగ్నురాలై సమాధిలోనికి పోయేది. కాలువగట్లపైన పొలంగట్లపైన స్పృహలేకుండా పడి ఉండేది. ఆవు లింటికి చేరినా ఆమె అడవిలోనే ఉండేది. ఆమె వాలకం చూచి బంధువులు అంత చక్కని శోభనాద్రికి పిచ్చిదాన్ని మూర్ఛరోగిని అంటగట్టినారన్నారు. అడవినుండి ఆలస్యంగా వస్తే అత్తమామలు మందలించేవారు. ఎవరేమన్నా పిచ్చమ్మ పట్టించుకోలేదు. ఆమెకు తన యోగమూ రామనామమూ అండదండలు.

కొన్నాళ్ళకు పిచ్చమ్మ గర్భవతి ఐనది. నాల్గవనెలలో అకస్మాత్తుగా శోభనాద్రిపోయినాడు.

10వ నెలలో పిచ్చమ్మ పండువంటి చక్కని బిడ్డను కన్నది. ఆ బిడ్డకు భాగ్యమ్మ అని పేరు పెట్టినారు. పాపకు నెల వెళ్ళగానే ప్చిచమ్మ తన భర్త ఆస్తిని మరదులకిచ్చి భాగ్యమ్మతో పుట్టినిల్లు చేరింది. అనాథ పిచ్చమ్మను పసికందు భాగ్యమ్మను వీరమ్మ ముత్తయ్యలు అక్కున చేర్చుకున్నారు. మారుమనువు చేస్తామంటే పిచ్చమ్మ తన తల్లిమీదికి భద్ర కాళివలె లేచింది. అంతటితో పిచ్చమ్మకు మారుమనువు ప్రసక్తి ఆగిపోయింది. కొన్నాళ్ళకు తండ్రిముత్తయ్య చనిపోయినాడు. సోదరులు వేరు పడ్డారు. వీరమ్మతో పాటు ఒంటినిట్టాడి ఇంట్లోనే పిచ్చమ్మ భాగ్యమ్మలుంటున్నారు. పిచ్చమ్మ కూలినాలి చేసి భాగ్యమ్మను అల్లారుముద్దుగా సాకినది. పిచ్చమ్మ ఒడలు దాచుకోకుండా కష్టించి నీతినిజాయితీతో పనిచేసేది. అది గమనించి యజమానులు పిచ్చమ్మను కావలెనని కూలికి రప్పించుకునేవారు. ఆమె మురామేస్త్రి ఐ తోటివారితో గూడ అట్లాగే పని చేయించేది. సంపాదించిన కూలితో బిడ్డకు ముద్దుముచ్చట్లు తీర్చి మిగిలినది ధర్మకార్యాలకు వినియోగించేది. భాగ్యమ్మను ఒకయింటిదాని చేయటం తనవిధి అనుకొని ప్చిచమ్మ బాగా కష్టించేది. కష్టార్జితం తింటూ ఇతరులకు తినిపిస్తూ కోటీశ్వరులకు లేని సంతృప్తి అనుభవించేది.

భాగ్యమ్మ గోముగా పెరిగి యుక్తవయస్కురాలైనది. ఊళ్ళోనే ఉండే అన్న కొడుకు కోటయ్య కిచ్చి పిచ్చమ్మ వైభవంగా పెండ్లి చేసింది. కాని భాగ్యమ్మ వైవాహిక జీవితం మూడునాళ్ళ ముచ్చటైనది. పిచ్చమ్మకు లేని సౌభాగ్యం ఆమె కూతురుకు కూడ లేకుండా పోయింది. కొలది దినాలకే కోటయ్య చనిపోయినాడు. విధి బలీయం కదా! భాగ్యమ్మ మరల తల్లి వద్దకే వచ్చింది. భాగ్యమ్మ దుస్థితికి పిచ్చమ్మ ఏడ్చినా ఆమె ధైర్యం సడలలేదు. కాని కపిలేశ్వరపురంనుండి ఆమె అక్క వచ్చి పట్టు పట్టి తన ఊరి యువకునికిచ్చి తానే పెండ్లిచేసింది. భాగ్యమ్మకు మారుమనువైనది కాని మనసులు కలువలేదు. అల్లుడు ఆతని తల్లిదండ్రులు భాగ్యమ్మను రాచి రంపానబెట్టినారు. పిచ్చమ్మ తన బిడ్డనువలెనే అల్లుణ్ణి ఎంత ప్రేమగా చూచిందో అవధూత ఐన తరువాత ఒకసారి చెప్పింది. ''ఆతణ్ణి శ్రీమంతుల అల్లునిగా చూచుకున్నాను. ఆతడు రాగానే పరిచయమున్న రైతులిండ్లలో అన్ని రకాల పిండివంటలు చేయించి తెచ్చిపెట్టేజాన్ని. అల్లుడు వచ్చినపుడల్లా అన్ని మర్యాదలుచేసి వెళ్ళేటప్పుడు గుప్పెడు రూకలు ఇచ్చేదాన్ని'' ఐనా అల్లుడు బిడ్డను ఆదరించలేదు సరికదా తిట్టి కొట్టి యమయాతనలు పెట్టినాడు. ఆ బాధలు భరించలేక భాగ్యమ్మ రెండు మూడుసార్లు పుట్టింటికివచ్చి గోడుగోడున ఏడ్చి అత్తవారింటికి పోనన్నది. పిచ్చమ్మ సీతమ్మ కష్టాలు వినిపించి కూతురును అత్తవారింటికి పంపేది. ఒకసారి బిడ్డ కష్టాలు తలచుకొని ''భాగ్యం కాపురం నిప్పులకుంపటి. అది ఏనూతిలో'' పడి చచ్చినా బాగుండును. పీడ విరగడై పోవును అనుకున్నది. ఒకనాటి రాత్రిభాగ్యం నూతిలో పడ్డట్లు పీడకల వచ్చింది. పరిశుద్ధాంతఃకరణులకు రాబోయే మంచి సెబ్బరలు ముందుగానే తెలుస్తాయంటారు. అనుకున్నట్లే భాగ్యం బ్రతుకు అభాగ్యంగానే ముగిసింది. కపిలేశ్వరపురం ఊరిబయట బావిలో భాగ్యం శవం తేలింది. ఆ దుర్వార్త రాగానే పిచ్చమ్మ హుటాహుటిగా పోయి బిడ్డ శవాన్ని చూచి గోడుగోడున యేడ్చింది. పోలీసులు వచ్చి నీకు ఎవరిపై అనుమానమో చెప్పుమంటే పిచ్చమ్మ ''నేను పూర్వజన్మలో ఎంత పాపం చేసినానో ఈ కష్టం వచ్చింది. ఇక నేను ఏ పాపమూ చేయను. నా బిడ్డకు మూర్ఛరోగం; నూతిలో జారిపడి ఉంటుంది. నాకెవ్వరిమీదా అనుమానం లే''దని నిర్లిప్తంగా చెప్పింది. కపిలేశ్వరపురం ఉళ్ళోకి పోకుండా కురుమద్దాలికి తిరిగివచ్చింది. ఓహో! ఏమా వైరాగ్యం!

భాగ్యమ్మ చావుతో పిచ్చమ్మలోని ఆవేదనంతా కన్నులవెంట గంగాయమునలై పారింది. ఆమె పూర్వ జన్మలో కొరవడిన యోగాన్ని గుర్వపేక్షలేకుండా సాధన చేసింది. తాను సంపాదించినదంతా పంచిపెట్టి మొలకు గోనెసంచి చుట్టుకున్నది. ఇల్లు విడిచి రుద్రభూమిని ఆశ్రయించింది. పిచ్చమ్మ భగవద్ధ్యానం చేస్తూ పిచ్చిదానివలె అటుఇటూ తిరిగేది. నిరంతరం రామనామం హనుమన్నామం చేస్తూ నిరాహారంగా శ్మశానంలో, పుల్లేటిగట్టున లక్కావజ్ఝలవారితోటలో ఎండల్లో వానల్లో చలిలో నిరాచ్ఛాదంగా తిరిగేది. ఆమెను పాములు క్రూరసత్వాలు అంటలేదు. ఇన్నాళ్ళు భాగ్యం కోసం ఏడ్చిన పిచ్చమ్మ భగవంతుని కోసం ఏడ్వసాగింది. హృదయపీఠంపై పరమాత్మని ప్రతిష్ఠించి కన్నీళ్ళ

పాద్యం ఇచ్చి అర్ధరాత్రి ఒక గుడిసెలో ఏడుస్తున్న పిచ్చమ్మ వద్దకు ఒక గోసాయి వచ్చి అనునయించి ఆదరించి కన్నీరు తుడిచి ఏమో ఉపదేశించి పోయినాడు. ఆమె బయటికి వచ్చి చూస్తే గోసాయి కనబడలేదు. తన ఆరాధ్యదైవం శ్రీ రామచంద్రుడే ఆ రూపంలో వచ్చి పోయినా డనుకున్నది పిచ్చమ్మ. భగవదాదేశం ప్రకారం ఆమె తోటిమానవుల దుఃఖనివారణకోసం తపనపడ నారంభించింది. ఆ తపనలోనే ఆ దుఃఖంలోనే ఆమెకు జ్ఞానసిద్ధి కలిగింది. కురుమద్దాలిలోను పరిసరగ్రామాల్లోను తిరుగుతూ భక్తులు పాడే త్యాగరాజు రామదాసు కృతులు, వేమన పద్యాలు, బ్రహ్మంగారి తత్త్వాలు, మొవ్వగోపాల పదాలు, సిద్ధప్పకీర్తనలు వింటూ పరవశించే పిచ్చమ్మకు అవి కంఠగతమైనవి. ఆకులములు, ఒంద్రుమట్టి, స్మశానంలోని బూడిద పిచ్చమ్మకు ఆహారం; స్త్రీ కనుక మొలకు గోనెపట్టా ఆచ్ఛాదం. అడవులు పరిసర గ్రామాలు పొలిమేరలు ఆమెకు సంచార భూములు. ఆమెకు శరీరాభిమానం పోయింది. ఆమె అవధూత ఐనది. అయినవాళ్ళంతా ఆమెకు పిచ్చిబాగా ముదిరిందని ఆశపడలుకున్నారు.

ఆమె ఏకాంతంగా ఉన్నపుడు కాలసర్పాలు వచ్చి పడగలు విప్పి ఆడుతుండటం చూచినవాళ్ళు ఆమెను మహాత్మురాలని గుర్తించినారు. అమ్మ పిచ్చిదని పశువులు కాచే పిల్లలు రాళ్ళు విసిరేవారు. అమ్మ ప్రేమతో సహించేది. ఒకసారి ఎంత వారించినా రాళ్ళు రువ్వే ఒక కుఱ్ఱను చూచి ''ఒరే కుఱ్ఱా! రాళ్ళు విసరకురా! చేతులు బొబ్బ లెక్కుతాయి'' అన్నది. నిజంగానే ఆతని చేతులకు బొబ్బలైనవి. వాడు ఏడుస్తూ ఇంటికి పరుగెత్తి తల్లిదండ్రులకు చేతులు చూపించి ఏడ్చినాడు. కారణం గ్రహించిన ఆ తల్లిదండ్రులు లబోదిబోమంటూ వచ్చి అమ్మ కాళ్ళపై పడ్డారు. ''పోతాయి పోరా!'' అన్నది కరుణా సింధువు పిచ్చమ్మ తల్లి. వెంటనే బొబ్బలు పోయినవి. ఇట్లాగే ఒక కుఱ్ఱవానికి అమ్మ ఆగ్రహంతో కండ్లుపోవటం అనుగ్రహంతో తిరిగిరావటం జరిగింది. దానితో కురుమద్దాలి జనుల కండ్లు తెరుచుకున్నవి. అమ్మ శక్తిని గుర్తించినవారు ఒక కుటీరం నిర్మించి బతిమాలి ఆమెను అందులో ప్రవేశపెట్టినారు. కాళ్ళు పడిపోయిన ఒక వ్యక్తిని బండిలో ఆసుపత్రికి తీసుకుపోతుండగా కుటీరం బయట నిలుచుండి చూచిన అమ్మ బండిని ఆపుమన్నది. వాళ్ళు ఆపకుండా పోతుంటే అమ్మ వెంటబడి బండిలోని రోగిని క్రిందికి గుంజి వీపుపై చేయివేసి ''ఇంటికిపోరా'' అన్నది. అతడు హాయిగా ఇంటికి నడచి పోయినాడు.

సదా రామనామం చేసే పిచ్చమ్మ రామవధూత పిచ్చమ్మగా ప్రసిద్ధి కెక్కింది. అమ్మ సన్నిధికి వచ్చేవారి సంఖ్య దినదినం పెరిగింది. తత్త్వ విచారమూ పెరిగింది. జిజ్ఞాసువులకు అమ్మ ఉపనిషద్రహస్యాలు గ్రామ్యభాషలో చెప్పేది. ఆర్తులు అర్థార్థులు రోగులు తమ గోడు చెప్పుకోవటానికి అమ్మ సన్నిధికి అధికసంఖ్యలో వచ్చేవారు. అమ్మ ఒకరిని చూచి ''నీ పని ఔతుంది పో'' అనేది మరొకని చూచి ''నువ్వెంత తన్నుకున్నా నీ పని కాదుపో'' అనేది. అమ్మ అన్నట్లే జరిగేది. ఆ విషయాలు తనలోని జీవుడికి తెలిసికాదు, ఆ రాముడేది పలికిస్తే అదే పలుకుతాడు ఈ జీవుడనేది. గ్రామాలలో కలరావంటి అంటురోగాలు వస్తే అమ్మ నిరాహారంగా ధ్యానంలో ఉండేది. పిన్నమనేని నాగయ్య స్వహస్తాలతో అమ్మకు అన్నం తినిపించిన ముఖ్య సేవకుడు. పిన్నమనేని వెంకటమ్మ వరలక్ష్మి మంగమ్మలనే గృహిణులు శ్రద్ధాభక్తులతో అమ్మను సేవించి ఆహారపానీయాలు సమకూర్చిన ధన్యులు. అమ్మ శరీరంనుండి జ్ఞానాగ్ని యోగాన్ని సెగలు పొగలు వెడలుతుంటే వెంకటమ్మ వరలక్ష్మమ్మలు కాగులకొలది నీళ్ళు ధారగా పోసి అమ్మతాపం చల్లార్చిన చల్లని తల్లులు. అమ్మ తన ధ్యానావస్థలోని అనుభవాలను అప్పుడపుడు వారికి వినిపించేది. దశావతారాలు కృష్ణుడు తనకు ధ్యానంలో కనిపించినా తన చిత్తం శాంతించని కారణంగా తిరస్కరించినానని చెప్పింది. భూమ్యాకాశాలు నిండిన తేజోరూపదర్శనంతో అమ్మలో బ్రహ్మానందభావన స్థిరపడిందన్నది. అమ్మను సేవించే భక్తులు పిన్నమనేని నాగమ్మ, పిన్నమనేని రామయ్య, బాలయోగిని బుచ్చమ్మ, అన్నపూర్ణమ్మ, మంగమ్మలు అమ్మకు **1925**లో ఆశ్రమం నిర్మించినారు. అమ్మ తపస్సుకు అనుకూలంగా, సమాధి ప్రవేశానికి వీలుగా, భూగర్భభువనేశ్వరం ఏర్పాటు చేసినారు. ఆశ్రమంలో ఉంటూ అమ్మ దినం విడిచిదినం సమాధిలోనికి, ప్రతిమూడు దినాలకు మౌనంలోనికి పోయేవారు. (సశేషం)

# ఆంధ్రకేసరి

(గతసంచిక తరువాయి - 6)

- రాష్ట్రకవి డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి

ఆనాడు మద్రాసు హైకోర్టు బారులో, నాఱితేఱిన యట్టియన ఝులుంద్రి
భాష్యమయ్యంగారు బారుకెల్లను నేత, శంకరన్నాయరు జడ్జిగాగ
శేషగిరయ్యరు శ్రీ సుందరయ్యరు, స్వామి నాథను మఱి వరదచారి
శ్రీ కుప్పుసామియు శ్రీయుతులల్లాడి, రహియించు వేంకటరామశాస్త్రి
యాది దిగ్దంతులైనట్టి యడ్వకేట్ల, ధాటికాగుచు, నిలబడి, తట్టుకొనుచు
శ్రీ ప్రకాశము కోర్టులో చెన్నుమీఱి, దక్షిణావని కంతకు దక్షుడయ్యె.
ప్రాక్టీసుహైకోర్టు వఱకు మాత్రమేగాక, రాజ్యమందంతటరగులుకొనియె
తమిళాంధ్రమళయాళ తలముల యందలి, యన్నిజిల్లా కోర్టులందుఁబ్రాకె
సివిలు క్రిమినలులోఁజెప్పఁదరముగాని, పెద్ద పెట్టున గొప్పపేరు వచ్చె
''అర్నాల్డువైటను'' యాచీఫు జస్టిసు, యల ''జాను వాలెసన్నడ్వకేటు
జనరలా'' దిగనాంగ్లేయ జనములెల్ల భళి! ప్రకాశము! మద్రాసు బారునందు
ఇంతప్రాక్టీసు గల్గిన యెమ్మెకాడు, నేడు లేడని పొగడరె, నిన్ను వహవ!
ఎంచఁబందొమ్మి దొందల యేడుగడచె, వందెమాతర యుగ మదివరలు చుండె
పొలు, మద్రాసురాష్ట్రంబుఁబర్యటించి, ప్రజలను ద్రిక్తపఱచుచుపన్యసించె
సరిగానప్పుడెయెవ్వరొ, వరయువకుడు దేశభక్తి భరితుండనగాన్
తిరునల్వేలికలక్టరు, దొర '' ఆష్'' అనువానిఁజంపెఁదూటాతోడన్
హత్యజరిగెనసలు యలతిరునల్వేలఁజెప్పకేసునడచెఁజెన్నపురిని
అది యుఁబూర్తి బెంచి హైకోర్టునందున, నిందితుని వకీలు నీవుగదవె!
శంకర కృష్ణన్నాబడు, గొంకదిమరిలేని మిగులఁగుఱ్ఱండనగాన్
జంకని విప్లవకారుడు, బింకముగాఁగోర్టుకొచ్చి భేషనిపించెన్
''అర్నాల్డువైటను'' నా చీఫుజస్టిసు, యాపూర్తి బెంచిని యధివసించె
ముద్దాయి కనువుగ మొదటినుండి వకీలు, మలచుకొనియెఁగేసుమంచిగాను
జడ్జీలనందఱచాక చక్యముతోడ, శ్రమపెట్టి సాధించె జయమునహహా!
చెప్పముద్దాయికిఁజివరికి రెండేండ్లు, చెఱసాల యందున శిక్షపడియె
శ్రీప్రకాశము భౌతిక జీవితమున, నొకమహర్దశఁబట్టించుననూ తమిద్ది
శ్రీప్రకాశము జాతీయ శీలమునకు, శ్రీగణేశను చుట్టిన శ్రీదినమది.
అచటి జడ్జీలనందఱనదుపు చేయ, నడపె ''లాటైమ్స్'' పత్రిక నవ్యగతిని
తానె సంపాదకత్వబాధ్యత వహించి, వ్రాయుచుండెను వార్తలు వాస్తవముగ
ప్రాక్టీసు నందలి పదునాలుగేండ్లలో, మొదటి యేడేండ్లవి మొదటి యెత్తు
అప్పుడార్జించిన యధికమొత్తములతో, యప్పులన్నియుఁదీర్చిహోయినుండె
పిమ్మటి యేడేండ్లు పెద్దపెట్టున లక్ష, లార్జించి ధనవంతుడనగ నెగడె

తమిళ తెలుగు నాట్లందలందన్ని నట్లుగ, స్థిరచరాస్తులనెన్నో సేకరించె
సాయపడినట్టి వారికి సాయపడియె, గురువు నాయుడు గారిని కూర్మిం గొలిచె
ఆత్మబంధువులందఱనాదుకొనియెంవల్లి ఋణమును దీర్చుకధన్యుడయ్యె.

పదియున్ తొమ్మిది యిర్వదొక్కటవదౌవర్షంబహో! యద్ది, యా
యదనందున్మటి గాంధిజీ పిలుపుందామానందంబునన్నందు మన్
హృదయంబందొక శంకలేకపలువుర్ వృత్తుల్ విసర్జించి, యా
కదనంబందున దూకిరంచుపలుకంగా నొక్కయాశ్చర్యమే!

బెంగాల్నందునంజిత్తరంజను డహో! పేరున్నదిగ్దంతి, యే
త్యాగంబైనను చేసి చూపగల మేథావంతు డాతండునున్
భోగంబుల్ తనవెంటవచ్చిన భలేపుణ్యాత్ముడా మోతిలాల్
యోగం బిచ్చిన న్యాయవాది పదమోహో! విడ్చిరప్పట్టునన్.

పిమ్మట టంగుటూరి తనపేదరికమ్మును బాపినట్టియా
కమ్మనివృత్తి నంతటిని గాలను దన్నుచు చెన్నపట్నతీ
రమ్మున బీచిలోన, బహిరంగ సభన్ బ్రకటించె నాసము
ద్రమ్ము, ప్రజాసముద్రమును తారలందాకి ప్రమోదమందగాన్.

నిజము వచింపదక్షిణపు నేతలలోమనటంగుటూరి యే
ప్రజలకు నేత, యాతడె శభాషనిపించుకనిల్చి, వృత్తినిన్
త్యజనమొనర్చినట్టి మహితాత్ముడు, దక్షుడు. చక్రవర్తి రా
జజియుంబ్రకాశమార్గమున జాడలంబట్టిత్యజించె వృత్తినిన్.

---

## మందిరాల స్థానంలో అక్రమ కట్టడాలు - అవమానాలా - ఆభరణాలా?

### తమిళనాడు

తమిళనాడులోను ఇదే కథ కొనసాగింది. నిజానదికి తమిళనాడులో హిందూ ధర్మ ప్రాబల్యం ఎక్కువగా ఉందని పలువురు భావిస్తారు. కాని తమిళనాడులోని ఆర్కాట్, మధురై, చెంగల్‌పట్, మద్రాస్, రామనాధనురం, తిరుచునాపల్లి, నాగూర్, తంజావూర్‌లలో నవాబులు సాగించిన విధ్వంసకాండకు హద్దులు లేవు. తమిళనాడులో శివక్షేత్రమైన చిందంబరంలో లాల్‌ఖాన్ మసీద్, నవల్‌ఖాన్ మసీద్, ఈద్‌గా, అమీనుద్దీన్ చిష్తి మజార్, సయ్యద్ హుస్సేన్ యొక్క మజార్‌లు ముస్లిం విధ్వంసకాండకు సజీవ సాక్ష్యాలు. అదే విధంగా నాగూర్‌లోని విశ్వవిఖ్యాత మసీద్ ఖాదర్ వలీషా యొక్క దర్గాలు కూడా హిందూమందిరాలపై నిర్మించినవే. తిరుచునాపల్లిలోని నద్దార్‌షా దర్గా, బాబా మొహియుద్దీన్ సరష్మత్ యొక్క మజార్, కాకీషాహ మజార్, షంస్‌పరాన్ యొక్క మజార్, సయ్యద్ అబ్దుల్ వాహబ్ యొక్క మజార్, షా ఫజులుల్లా ఖాదరీ యొక్క మజార్, షానసిరుద్దీన్, ఫరిదుద్దీన్, హజ్రత్ చాంద్ మస్తాన్, సయ్యద్ జైలు లబుద్దీన్, సయ్యద్ కరీముద్దీన్ ఖాదిరి, అలీముల్లా ఖాదిరి, షా ఇమాముద్దీన్ ఖాదిరి, ఖాజా అమినీద్దీన్ చిష్తి, ఖాజా అహ్మద్‌షా హుస్సేన్ చిష్తి, షాజమాలుద్దీన్ హుస్సేన్ చిష్తి, కాయమ్‌షా ముస్సిఫ్‌సా సుహ్రావర్ద్య, ఇతైఫాక్‌షా, సయ్యద్ జలాల్ ఖాదిరి, మత్తాబ్‌షా శిరాజ్ సుహ్రావర్ద్య వంటి ముస్తిం ''సాధువులు'' మజార్‌లు ఈ పద్ధతిలో నిర్మించినవే.

ఆర్కాట్, వెల్లూర్, మధురైలలో నేడు కనిపించే అనేక మసీదులు ఒకప్పుడు మందిరాలుగానే ఉండేవి.

## అర్చకుల, వేదశాస్త్ర పండితుల, పురోహితుల విశిష్టత

- ఈమని సువర్ణం, ఎమ్. ఎ.

అర్చకా దేవపూజకాః అనే సూక్తి ఉన్నది. అట్లే వేదపండితులు నిరంతరం వేదాధ్యయనంలో ఉండాలి. పురోహితులు పురానికి హితులు. వీరి స్వేచ్ఛాజీవనానికి ఎట్టి ఆటకంకం రాకుండా, వీరికి గుడిమాన్యాలు, పారితోషికం, సంభావన, దానాలు ఇవ్వడం అనాది నుండి వస్తున్నది. రాజాధిరాజులు అరణ్యాలకు వెళ్ళి మహా ఋషుల సలహాలను స్వీకరించేవారు. ధర్మసందేహాలను తీర్చుకునేవారు. లౌకికానికి మితిమీరిన ప్రాధాన్యం ఇవ్వడం అర్చకులకు ''జీతాలు'' అనే పదం వాడడమే శాస్త్రవిరుద్ధం. పాలకులు, సేవామూర్తులు ఈ సత్యాన్ని, చక్కటి సంప్రదాయాన్ని తెలిసో తెలియకో విస్మరించడం జరుగుచున్నది. అర్చకులు దేవునికి దాస్యులు కాని, పాలకులకుకాదు.

అర్చ కస్యతపో యోగాత్, అర్చకస్య అతిసాయనాత్, నిత్యం సన్నిహితో విష్ణుం. తిరుపతి వేంకటరమణమూర్తి ఎంతో మహిమతో మహా ఋషులు నిర్ణయించిన నియమాలు, సాంప్రదాయాలు, మార్పుటకు మానవ మాత్రుల వల్ల కాదు. అట్లు చేస్తే, ఆలయాల మహిమతగ్గుతుంది.

భక్తపోతన, త్యాగరాజు, గోపన్నలాంటి మహానీయులు శాశ్వతంగా తరతరాలనుండి గౌరవింపబడుటకు వారి ఆధ్యాత్మికత, డబ్బుకి దాసులు కాకపోవడమే కారణాలు. ఈ కోవకు చెందిన వేదపండితులు, అర్చకులు, పురోహితులు, ఆశ్రితులు కాకూడదు. వీరు ఆధ్యాత్మికంలో నిమగ్నులగుటక్కు, పాలకులు, సమాజం తమంటతామే, వీరికి జీవనోపాధికలుగ చేయడం సమంజసం. వీరినుండి మనవిపత్రాలు, అర్జీలు, అలజడులు, కోర్టుకేసులు వచ్చే పరిస్థితులు కలుగచేయడం హిందూ సమాజానికే అవమానకరం.

మన పీఠాధిపతుల, ప్రఖ్యాతులైన పండితుల మార్గ దర్శనంతో, ధర్మసంస్థల, అర్చకత్వ నిర్వహణ జరగాలి. లౌకిక సిద్ధాంతానికి లోబడిన ప్రభుత్వం ధర్మసంస్థల ఆంతరంగిక వ్యవహారాలలో కలుగచేసుకోవడం, దేశానికి హానికరం. ఇవి రాజకీయాలకు అతీతంగా ఉండాలి. అంతేకాక ఇదివరలో మహా మేధావులు, పండితుడు, పరిపాలనా దక్షుడైన నర్సి.పి. రామస్వామి అయ్యరు లాంటి వారి అభిప్రాయాలను పూర్తిగా పాటించాలి. ఏది ఏలాగున్నా అర్చకులను కోర్టులపాలు చేయడం, ఆర్థికంగా ఇబ్బందులకు గురి చేయటం తగదు. వీరి స్వేచ్ఛా జీవనానిని పూర్తిగా పరిరక్షించాలి.

### జీవిత సభ్యులు

**683**
**శ్రీ పణతుల వేంకటరమణయ్య**
**అన్నసత్రం**
**13-2, ధర్మపురి**
**కరినగరం (జి) 505 425**

**శ్రీ గ్రంధి మాణిక్‌లాల్**
**78-16-6 శ్యామలానగర్**
**రాజమహేంద్రవరం - 533 103.**



**684**
**శ్రీ కె. జగన్నాధాచారి**
**షరాఫ్ బజార్**
**ఆదోని**
**కర్నూలు (జి)**

## బ్రహ్మో వర్తమెక్కడుంది?-

(రాజన్)

1. పురాతన ప్రపంచపటం ఆర్యావర్తము, బ్రహ్మోవర్తముగా విభజించబడింది.
2. ఆర్యావర్తములో దక్షిణ ఆసియా, ఆగ్నేయాసియాలు, బ్రహ్మావర్తములో నైరుతి ఆసియా, ఉత్తర ఆఫ్రికాభాగాలు, మరియు యూరప్‌లు ఉన్నవని.
3. వామనపురాణం (1భా) ప్రకారం సరస్వతి, ధ్రిషద్వతి అన్నముఖ్య నదులు బ్రహ్మోవర్తంలో ప్రవహించుచున్నాయి.
4. భవిష్యపురాణం (మ్లేచ్ఛచరిత్రలో) ప్రకారం ''కలియుగం 2000 సం॥తర్వాత (1200. బి.సి.) మ్లేచ్ఛులు యిబ్బడి, ముబ్బడై అన్ని దిశలలో వ్యాపించారు. మోజెస్ (మూసా) బ్రహ్మోవర్తములోని సరస్వతి నదిబడ్డున నివసించాడు.
5. దురదృష్టవశాత్తు భారత పరిశోధక శాస్త్రవేత్తలు సరస్వతి నదికై భారతదేశంలో అన్వేషించి కనిపెట్టలేని స్థితిలో ఆనది (మాయం) ఎండిపోయినదని ఒకరు, రాజస్థాన్‌లో ప్రవహించి ఎడారిలో లీనమైపోయిందని మరో శాస్త్రవేత్త నిర్ణయించారు. బహుశా ఆశాస్త్రవేత్తల ఊహలు (పరిశోధనలు) ఎండిపోయి ఉంటాయి.
6. సరస్వతి నది ఒకటిగా ఎప్పుడూ పేర్కొనబడలేదు. అది సరస్వతి మరియు ద్రిషద్వయలుగా రెండునదులు.
7. బాబిలోన్ నాగరివేత యూఫ్రెటిస్ - టైగ్రిస్ ( ఇరాక్‌లో) రెండు నదుల పరివాహ ప్రాంతంలోనిది - ఈ నదుల 'ఫరాద్ - టైగరీ'లూ అని కూడా తెలియబడుతున్నాయి.
8. పూర్వం ఫరాద్‌నదే సరస్వతిగా తెలియబడ్డది. సంస్కృత భాష ఆధారంగా 'స' 'హ' లేక 'ఫ' గా జన్యభాషలో వస్తుంది.
ఉదా:- సంస్కృత 'దహన' అరబిలో 'దఫన్' అయింది అలాగే 'సప్త' 'హప్త' గా మారుతుంది.
9. 'సరస్వతి'లోని 'స' - 'ఫ' గా 'ర' 'హ' గా మారి రానురాను 'ఫరాద్' FAR-AAD)గా ఉచ్చరించబడ్డది.
10. 'యూఫ్రెటిస్' (సరస్వతి) నది ప్రాంతమైన 'ద్రిషద్వతి' 'టైగ్రిస్' లేక 'ట్రిగ్రిగా ఎలా తెలియబడిందో చూడవలసి ఉంది.

---

## శాకాహారం - మాంసాహారం

తమవలె, జీవించే, సాటి,
జీవిని చంపేయుచు-
రుచి అని, మాంసాహారం,
బలమని భుజియించుచు-
కబేళాలా గోమాతను
నిర్దయతొ నరుకుచు -
గొర్రె, బర్రె, ఒంటె, మేక,
కోళ్ళు, ప్రాణం తీయుచు -
విదేశాలకు మాంసం,
నిరతం ఎగుమతి చేస్తు -
అలంకరణ సామగ్రిగ
ప్రాణి చర్మం వాడుతు -
జగతి మనలు మానవులకు,
ఇది తప్పని చెప్పుదాం!
హింసా 'మాంసాహారం',
మాని జగతి మనలుదాం.!
అహింసను ప్రోత్సహించు -
'శాకాహారం' వాడుదాం!
''జీవ హింస'' మాని జనులు
మనలునట్లు చేయుదాం.

_మహమ్మద్ అబ్దుల్ అజీజ్

## లండన్‌లో అత్యద్భుత ఆలయం

స్వామి నారాయణ్ ఆలయాన్ని లండన్‌లోని నీస్‌డెన్ దగ్గఱ ఆగష్టు 1995లో ప్రముఖ్ స్వామి మహరాజ్ ప్రారంభించారు. ఈ ఆలయానికి 2,828 టన్నుల సున్నపురాయి మరి 2000 టన్నుల కరారా చలువరాయి పట్టినది. 1546 మంది కార్మికులు వందలాది మంది కార్యకర్తలు నిర్మించారు. ఈ ఆలయంపై కప్పు 72 అడుగులు. జైన్ ఆలయాల తీరులో యీపై కప్పును నిర్మించారు. నిర్మాణపు ఖర్చు 50 లక్షల పౌండ్లకు పైగా అయింది. అందుకే 1997 సం॥లో తయారు చేయు గిన్నీస్‌బుక్‌లో నమోదుచేశారు. యీ అత్యద్భుత దేవాలయాన్ని 40 దేశాల్లో 37 భాషల్లో ప్రచురిస్తారు.

సేకరణ – చే రెడ్డి శ్రీరామ్ రెడ్డి.

---

## మాస విశేషాలు

ఫాల్గుణం – చైత్రం ( ఏప్రిల్ 97)

8. ఉగాది – ఈశ్వరనామ సం॥
ప.పూ. డాక్టర్జీజయన్తి
ఆర్యసమాజ్ స్థాపన

13. జలియన్‌వాల్‌బాగ్ సంస్మరణ
రమణమహర్షిజయన్తి

14. అంబేద్కర్‌జయన్తి

16. శ్రీరామనవమి

20. మహావీరజయన్తి

22. చైత్రపూర్ణిమ –

చైత్రం – వైశాఖం (మే. 97)

5. రవీంద్రనాథ్‌ఠాకూర్ జయన్తి

7. అల్లూరి సీతారామరాజు బలిదానం

9. రాణాప్రతాప్ జయంతి
పరశురామజయంతి

11. శంకరజయంతి
రామానుజ జయంతి

17. వాసవీ జయంతి
బ్రహ్మంగారి జయంతి

20. వీరసావర్కార్ జయంతి
నృసింహజయంతి

22. బుద్ధపూర్ణిమ

31. హనుమజ్జయంతి





ధర్మయాత్రా మహా సంఘ సమావేశం - వరంగల్

సర్వశ్రీ డా. విశ్వనాధరావు, పూజ్యశ్రీ శివానందమూర్తి, శివరావుగార్లు.

Statement about ownership and other Particulars of "VISWA HINDU"

**FORM IV (See Rule 8)**

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | 4-5-212, Koti<br>Hyderabad - 500 195 A.P |
| 2 | Periodicity of its Publication | Monthly |
| 3 | Publisher's Name | T. Lingamurthy |
| | Whether citizen of India | Yes |
| | Address | 1-1-336/26 Sri Nilayam<br>Viveknagar, Hyderabad-20A P |
| 4 | Editor's Name | P.Sundara Rao |
| | Whether citizen of India | Yes |
| | Address | 4-5-212 Koti<br>Hyderabad - 500 195 A.P. |
| 5 | Printer's Name | VHP (A P.) |
| | Whether citizen of INdia | Yes |
| | Address | M/s KalaJyothi Process Limited<br>1-1-60/5,Iftekar Mansion Lane<br>RTC 'X' Roads, Musheerabad<br>Hyderabad - 500 020 A.P |
| 6. | Names and addresses of individuals who own the newspaper and partners of shareholders holding more than one percent of the total capital. | **VISWAHINDU PARISHAD. A.P.** |

**I,T.Lingamurthy,** hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd/-

**(Sd.) T. Lingamurthy**

Signature of Publisher

Date: